# మన చేతుల్లోనే వుంది



# మన చేతుల్లోనే ఉంది

(వచన కవితా సంపుటి)



జె. బాపురెడ్డి

ప్రచురణ

జయం ప్రచురణలు

హైదరాబాద్

**MANA CHETULLONAY UNDI**

Collection of free verses in Telugu

by Dr. J. BAPU REDDY

First Edition 1986



**Price Rs. 25/-**

U. S. $ 5

Cover design : by **Sheela Veeraraju**

Published by

JAYAM PRACHURANALU

Plot No. 10, Road No. 5

Jubilee Hills, Hyderabad-500 034.

Printed at :

Sapphire Fine Printers, Kachiguda, Hyderabad-500 027.

# అంకితం

అంతర్జాతీయ ఖ్యాతి ఆర్థిక శాస్త్రవేత్త - ప్రజాజీవన ప్రగతిమార్గదర్శకులు

**ఆచార్య సి. హెచ్. హనుమంతరావుగారికి**



సి. హెచ్. హనుమంతరావు. కె. బాపురెడ్డి.

కరీంనగరం మండలంలో నేను పుట్టిన సిరిసిల్ల గడ్డమీద మాదుపాక గ్రామంలో మామూలు రైతు కుటుంబంలో పుట్టి, అతిక్లిష్ట పరిస్థితుల్లో విద్యాభ్యాసం చేసి విద్యార్థి నాయకుడై, సామాజిక చైతన్య మూర్తియై, పల్లెనుంచి ఢిల్లీవరకు ఎదిగి, ఆర్థికశాస్త్రంలో సృజనాత్మక మౌలిక పరిశోధనలు అధ్యయనాలు చేసి, భారతదేశ ప్రణాళికా సంఘ సభ్యత్వపదవిని అత్యంత సేవాభావంతో నిర్వహించి, అఖిలజన కల్యాణ ప్రదమైన ఆర్థిక జీవనోద్దీపక జిజ్ఞాస యజ్ఞంలో తన నిరామయ నిరాడంబర జీవితాన్ని అంకితంచేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి, స్నేహశీలి ఆచార్య సి. హెచ్. హనుమంతరావుగారికి మా మూడు దశాబ్దాల అవిచ్ఛిన్న అవ్యాజ స్నేహానికి అభ్యుదయాక్షర చిహ్నంగా ఈ ఆత్మవిశ్వాసకాళింది "మన చేతుల్లోనే ఉంది" కావ్యం అంకితం చేయబడింది.

# ఇందులో...

# మనచేతుల్లోనే ఉంది...ఏమిటి?

కళా ప్రపూర్ణులు డా॥ బోయి భీమన్నగారితో నా క్రొత్త రచనలగురించి ప్రస్తా విస్తూ, నా వచన కవితలన్నీ మూడు సంపుటాలుగా కూర్చి ప్రచురింప బడుతున్నాయి అన్నాను. ఆధ్యాత్మిక తాత్విక చింతనాపరమైన సాహిత్యదర్శనం ''అనంత సత్యాలు''గా ఆవిష్కృతమై మీ "అనాది కొసనుంచి అనంతత్వంలోకి" వలెనే వచన కవితా ప్రక్రియలో ఒక కొత్తమలుపు తీసుకొని వచ్చిందిగదా! అలాగే ఆర్థిక సామా జిక నిత్య సత్యాలను, భౌతికజీవన వికాసాన్ని ప్రతిపాదించే వచన కవితలన్నీ కలిపి ఒక గద్యకావ్య సంపుటిగా వేయాలని సంకల్పించాం- ఆ పుస్తకానికి ఒక మంచిపేరు సూచించండి అన్నాను. ఇక మూడవ వచనకావ్య సంపుటి స్త్రీ పురుష ప్రేమగతమైన ప్రణయాత్మక భావకవితల తోరణంగా వెలువడుతుంది. ఆపుస్తకానికి పేరు తర్వాత ఆలోచిద్దాం కాని ఇప్పుడు ముద్రణకు సిద్ధంగాఉన్న ఆర్థిక సామాజికా భ్యుదయ వచన కావ్యసంపుటానికి పేరు సూచించండి అన్నాను.

శీర్షిక మానవుని విశ్వచైతన్యాన్ని అప్రతిహత నిర్మాణశక్తిని సూచించేదిగా ఉండాలి; అంతా మనచేతుల్లోనే ఉంది అనే ఆత్మ విశ్వాసాన్ని సమతాసత్య సంధీభా వాన్ని పెంపొందించేదిగా ఉంటే బాగుంటుంది అన్నాను. ఆయన వెంటనే, ఇంకేం పుస్తకంపేరు మీరే చెప్పేశారుగదా- ''మనచేతుల్లోనే ఉంది''. ఇక ఆలోచించకుండా ఆపేరే పెట్టండి అన్నారు. మహాకవి షేక్సిపియర్ అంతటి మహనీయుని "As you *like it*" వంటి పుస్తకనామోదంత వేదాంత స్మృతిలో కాసేపు తేలిపోయాం. అయితే ఏమిటి మనచేతుల్లోనే ఉంది అని తర్కించుకోగానే "మంచైనా చెడైనా మన చేతుల్లోనే ఉంది- దైవమైనా దయ్యమైనా మనిషి ప్రవర్తనలోనే ఉంది" అన్న పుస్తకం లోని ఆఖరు కవిత ఆవిర్భవించింది

నేను 1955 నుంచి వ్రాస్తున్న వచన కవితల్లో సామాజిక ప్రగతికి దోహదం చేసే భావగతమైన కవితల్ని-ముద్రితాముద్రితాలను కూర్చి-ఈ గ్రంథంలో చేర్చడం జరిగింది. అంతమాత్రంచేత ఆధ్యాత్మిక పరమైన తత్వచింతనకూ, స్త్రీ పురుష ప్రేమావలంబకమైన శృంగార దృష్టికీ ఆర్థికజీవన చైతన్యానికీ మధ్య మౌలికమైన విభేదాలు ఉన్నాయని కాదు. అవి పరస్పర విరుద్ధాలు అంతకన్నా కాదు ఈ త్రిధారా గత భావసమన్వయ సమ్యక్ సమగ్ర జీవిత సత్యాన్వేషణం నాదీ.

ప్రణయమైనా, ప్రణవమైనా, ఆర్థిక ప్రగతియైనా ఆనందమయ మానవ జీవిత సాధనకే తోడ్పడాలి. నవరసభరితమైన జీవితం నిర్వచించే నిర్దేశించే ఆదర్శం ఆశయం ఒకటే. అభ్యుదయశీలక ఆనందోన్ముఖత అన్ని భావధారల్లో ఆవిష్కృతమైనపుడే, పరస్పర సమన్వయాత్మకమైనపుడే, సిసలైన సాహిత్య దర్శనం అవుతుంది.

అందుకే, అహం బ్రహ్మాస్మి, త్వమేవాహం అనే అద్వైతవాదానికి, మనుషులంతా ఒక్కటే, మనిషి జీవితపు విలువలు విజయాలు మనిషి చేతిలోనే ఉన్నవి అన్న మార్క్సు వాదానికి అట్టే తేడా లేదు. మనిషీ మనిషీ సమానులు లేక మనిషీ దేవుడూ సమానులే అన్నా ప్రతిపాదితమయ్యే సమతావాద మొకటే-సత్యానుభూతి ఒకటే. సమతా సత్య దర్శనం కలిగించే ఏ సాహిత్యమైనా అభ్యుదయగామియే, సమాదరణీయమే. ప్రణయం-ప్రణవం-ప్రగతి-ఈ మూడు పరిధుల్లో, స్థాయిల్లో, సత్యానుభూతి కలుగుతూ ఉంటుంది. అనంతసత్య గర్భితమైన ప్రకృతిలోనుంచి, మానవ ప్రకృతిలో నుంచి ఈ త్రిముఖాత్మక త్రివిధానంద జీవితానుభూతులు ఆవిష్కృతమౌతున్నవి. అవి పరస్పర విలక్షణమైనవే కాని విరుద్ధాలు కావు.

ఈ పుస్తకంలోని కవితలు మూడు దశాబ్దాలుగా నాలో అలవోకగా వెలిగిన ప్రాపంచికాలోచనలకు అక్షరరూపం. కుక్క మొదలు కువలయంవరకు, గ్రామ సీమలు మొదలు వ్యోమసీమలవరకు విస్తరించిన కవితావస్తు వైవిధ్యం ఇందులో చోటుచేసుకున్నది. కుటుంబ సంక్షేమమైనా, మానవ కుటుంబ సంక్షేమమైనా అభ్యుదయశీల కవితాదర్శనంగా అభివ్యక్తమైంది. నవసమాజ నిర్మాణానికి, సమసమాజ సాధనకు, సర్వమానవ సౌభాగ్యదీప్తికి దోహదం చేసే శక్తి "మనచేతుల్లోనే ఉంది" అన్న ఆత్మ విశ్వాసాన్ని ఈ కవితాసత్యాలు కలిగిస్తాయని ఆశిస్తున్నాను. భావసత్యాల విశ్వసనీయ పరిణామమే భౌతిక జీవితానుభూతులౌతాయనే నా భావ భౌతిక దర్శన వాదానికి కూడా ఈ గ్రంథం లక్షణము లక్ష్యము కావాలని ఆకాంక్షిస్తున్నాను.

ఈ పుస్తకం, నా చిరకాల మిత్రులూ నిత్యసత్యాన్వేషి, నిర్మల నిరాడంబర జీవనుడైన డా॥ సి. హెచ్. హనుమంతరావుగారికి స్నేహోపాయనంగా అంకితం చేస్తున్నాను. ఢిల్లీలోని "Instituite of Economic Growth"లో విజ్ఞాన తపస్వియై ఆచార్య వర్యులై తన ప్రతిభామయ ప్రగతిశీల భావసంపదచేత భారతదేశపు

ప్రిణాళికా సంఘ సభ్యులుగా నియమితులై ప్రశంసనీయ సేవ లందించిన మేటి మేధావి. పల్లెనుంచి ఢిల్లీవరకు ఎదిగిన మహిత మానవతా శిఖరం ఆయన. సతీమణి శ్రీమతి కృష్ణకుమారి అందించే నిరంతర సహకార సంప్రేరిత పినాకపాణి ఆయన. నా పట్ల ఉన్న ప్రేమాభిమానాలతో ఈ కృతిని స్వీకరిస్తున్నందుకు ఆయనకు కృతజ్ఞుణ్ని. మా ఉమ్మడినేస్తి, సహోద్యాయుడూ, స్వశక్తి సంపన్నుడూ అయిన శ్రీ K. S. రెడ్డిగారు ఈ మా సాహిత్య బాంధవ్యానికి తోడ్పడనందుకు ఆయనకు కూడా నేనెంతో ఋణ పడి ఉన్నాను. ఆర్షమైత్రికి ఈ కృతి ఒక సుందర ప్రతీకగా వెలుగుతూ ఉండ గలదని విశ్వసిస్తున్నాను.

ఈ పుస్తకానికి వెలలేని పీఠిక వ్రాసిన విఖ్యాత తెలుగుసాహిత్యాచార్యులు డా. జి వి. సుబ్రహ్మణ్యం గారికి నా వినయపూర్వక కృతజ్ఞతలు. 1953 లో నేను నిజాంకళాశాలలో విద్యార్థిగా చేరినప్పటి నుండి ఇప్పటి దాకా నా సాహిత్య వ్యవసాయాన్ని గమనిస్తూ ప్రోత్సహిస్తున్న ప్రతిభా పక్షపాతి ఆయన. మా చిర కాల సాహితీబాంధవ్యం అవిచ్ఛిన్న స్వచ్ఛ స్వేచ్ఛా స్నేహబంధంతో ముడిపడ్డది. రచయితగా, విమర్శకుడుగా, కవిగా, మహా పండితుడుగా, గంభీరోపన్యాసకుడుగా ఆబాల గోపాలంచే ప్రశంసలందుకున్న నిరాడంబర నిత్యచైతన్యమూర్తి ఆయనది- అజాతశత్రు కీర్తి ఆయనది. కట్టమంచి రామలింగారెడ్డి వంటి సృజనాత్మక విమర్శకుల కోవకు చెందిన ఆచార్య సుబ్రహ్మణ్యం ఈ గ్రంథానికి ఆముఖం కూర్చడం నా భాగ్యంగా భావిస్తున్నాను. కృతజ్ఞతా పూర్ణహృదయాన్ని ఆయనకు నివాళి పడుతున్నాను.

నా సాహిత్యయాత్రలో నాకు అనుదినం తోడ్పతున్న సాహితీబంధువులు విజ్ఞాన ప్రజ్ఞాన సింధువులు డా. బోయి భీమన్న, డా. సి. నారాయణ రెడ్డి, డా. దాశరధి, డా. కొత్తపల్లి వీరభద్రరావు, డా. తూమాటి దొణప్ప, శ్రీ దేవులపల్లి రామానుజరావు వంటి పెద్దలందరికీ ఈ సందర్భంలో కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. పేరు పేరున పేర్కొనలేని అగణిత హితకోటికి ప్రతినిధులుగా వారిని పేర్కొం టున్నాను. అయితే ఈ మధ్య గుంటూరు మండల సాహిత్యాభిమానులు సారస్వత సంఘసేవా కళా సంస్కృతీ సంస్థలు, ప్రపంచకళా సంస్కృతుల అకాడమీవారు, ఉత్తర అమెరికా తెలగు సంఘం వారు నా పట్ల చూపిన ఆదరాభిమానాలు మరుపు రాని మరువలేని ఒక మహానుభూతి. వారందరికీ నా అనిర్వచనీయ మౌన మనో నమోవాకాలు.

ఈ గ్రంథాన్ని అంతర్జాతీయ ప్రమాణానుగుణ్యమైన నాణ్యతతో ప్రచురించిన జయం ప్రచురణల వారికి ముఖ్యంగా ఆ సంస్థ నిర్వాహకులు శ్రీ జె. మారుతి గారికి ముచ్చటగా పుస్తకాన్ని ముద్రించిన సఫైర్ ప్రింటర్స్ వారికి నా కృతజ్ఞతలు. నిత్యచైతన్యశీలి, సాహితీ ప్రయోగశీలి అభ్యుదయ కళాతపస్వి శ్రీ శీలా వీరరాజు ఈ పుస్తకానికి భావస్ఫోరకమైన ముఖచిత్రం రచించినందుకు వారికి ప్రత్యేక ధన్యవాదాలు. నా సాహిత్య యాత్రలో సహన సహకారేశ్వరియై నాకు తోడ్పడుతున్న నా జీవితేశ్వరి రాజేశ్వరికి నా ప్రేమపూర్వక కృతజ్ఞతలు. నన్నూ నా రచనలనూ ముప్పదిదేళ్ళుగా సమాదరిస్తున్న విజ్ఞ రసజ్ఞ పాఠకలోకానికి వినయపూర్వకంగా చేతులు జోడిస్తూ ఈ పుస్తకాన్ని అందిస్తున్నాను.

జె. బాపురెడ్డి

# మనిషికోసం వ్రాస్తున్న మనిషి

"భావ కవిని కాదండీ నేను
బాపురెడ్డిని
మురికి వాడల్లో ముక్కు మూసుకొని
మునీశ్వరుడైన లోచూపురెడ్డిని—" (పు. 89)

ఎన్నుకొన్న విషయాన్ని తనదైన బాణీలో — ఇది బాపురెడ్డి ఫణితి అని స్ఫురించే లాగా — చెప్పటం బాపురెడ్డి గారి ప్రత్యేకత. దాదాపు, పదేళ్ల క్రితం తనను తాను పరిచయం చేసికొంటూ, 'భాగ్యనగర భాగధేయం'లో అన్న మాట లివి. భావకవి కాకపోతే అభ్యుదయ కవిగాని, విప్లవ కవిగాని, సంప్రదాయకవిగాని ఎవరో ఒకరుగా తానై ఉండాలి. కాని, తాను బాపురెడ్డి. అంటే ఆధునిక తెలుగు కవిత్వంలో బాపురెడ్డి అనేపేరు ఒక ప్రత్యేక పంథాకు, ఒక విశిష్ట వ్యక్తిత్వానికి పెట్టదగిన పేరన్న మాట. మురికివాడల్లో ఉండటం సామాజికచైతన్యస్ఫూర్తిని వ్యక్తంచేస్తుంది; ముక్కు మూసుకొని మునీశ్వరుడై లోచూపును సారించే ప్రవృత్తి - జీవితాన్ని తాత్త్విక దృక్పథంతో దర్శించే చిత్తవృత్తిని వ్యంజింప చేస్తుంది. 'భావకవి' అనే పదాన్ని వాచ్యార్థం లోనూ వాడలేదు; రూఢ్యర్థంలోనూ వాడలేదు; వ్యంగార్థం లో వాడారు బాపురెడ్డి గారు. అంటే -- కలలు కనే వాడు కాడీకవి. వాస్తవాలను చూచి, అనుభవించి వాటిలోని జీవిత సత్యాలను అనంత సత్యాలుగా ఆవిష్కరించే ఆధునిక కవి. జె. బాపురెడ్డి జీవితతత్వాన్ని కవితాదృష్టితో అన్వేషించే లోచూపురెడ్డి. ఆధునికాంధ్ర కవిత్వరంగంలో అటువంటి ప్రవృత్తికి ఆయన పేరే ప్రతినిధి. ఇది ఆయన ఆహంకారంతో చెప్పుకొన్నది కాదు. సవినయంగా సాధికారంగా చెప్పుకొన్నది.

శ్రీ శ్రీ ఆధునిక కవులను రచయితలను మూడు రకాలుగా విశ్లేషించి వివేచించాడు -- "నేటి సాహిత్యపరులలో మూడు రకాలు నాకు కనపడతారు. వీరిలో మొదటిరకం, నిజంగా సాహిత్యం నాశనమై పోతున్నదని గట్టి నమ్మకం ఉన్నవారు. పూర్వ సంస్కార మంతటికీ తాము కాపలాదారుల మనుకుంటారు. ఇక రెండో రకం వారున్నారు. సులువుగా దేనినైనా అనుకరించ గలిగిన పాటి తెలివి తేటలుంటాయి వీరికి ......ఇక మిగిలిన రకం రచయిత ప్రజల మధ్య, ప్రజలతో

కలసి జీవిస్తాడు....... ఈ మూడు రకాల రచయితలలో మొదటివారిపట్ల జాలి వహిస్తాను, రెండోరకం అంటే అసహ్యించుకుంటాను. మూడో తెగవారి మీద నా కావరం గౌరవం''. బాపురెడ్డి గారు ఈ మూడు రకాల కవుల్లో శ్రీ శ్రీ ఆదరించే, గౌరవించే రకానికి సంబంధించిన వారు. జాతి జీవనంతో కలిసి తానూ ఒక చైతన్య శక్తిగా నడవటం బాపురెడ్డి గారి స్వభావం. ప్రజలతో కలిసి జీవించటం కమిటెడ్ దృక్పథానికే సాధ్యమని బాపురెడ్డి గారు విశ్వసించరు. సమాజ జీవితానికి సర్వతో ముఖ శ్రేయాన్ని సాధింపగలిగే ఏ శక్తినైనా, ఏ యుక్తినైనా ఆయన సమర్థిస్తారు. తాత్త్వికంగా దానిని భావిస్తారు; వాస్తవ జీవితంలో దాని ప్రయోజనాన్ని సమీక్షిస్తారు; కవితామయంగా అభివ్యక్తీకరిస్తారు.

“అంతరిక్షపు
అతిథియై
ఆనంద పారావారంలో తేలి
నవజీవన
నక్షత్రంలా వెలుగుతూ
భావ భౌతిక సత్యయోగంతో
కులమత వర్గీకరణమును
కూలద్రోస్తూ
పరిణామ ప్రపంచాంగం
ప్రణుతి కెక్కుతున్న
భారత దేశానికి జయోస్తు
సమతాభావ పాత్రిభవాల
సారథి యైన భారతీయుడు
పాత్రిరంభించిన
ఈ వీర విజ్ఞాన విప్లవ పర్వంలో
ఒళ్ళు విరిచి గర్జించే
ప్రజా శక్తి గర్వానికి విజయోస్తు”

ఈ వచనకవిత రచించిన బాపురెడ్డిని, ఆయన కవితను వివేచించటం, విశ్లేషించడం అంత తేలికకాదు. భాషను చూస్తే – పరస్పర విరుద్ధ సాహిత్యమార్గాలకు

చెందిన ఉద్యమకర్తల అభివ్యక్తుల జాడలు కనపడతాయి. ఒళ్ళు విరిచి గర్జించే ప్రజాశక్తిని వ్యక్తీకరించే విప్లవకంఠం ఆనందపారావారాన్ని గురించి స్మరించలేదు; 'భారత దేశానికి జయోస్తు' అని భక్తిప్రశస్తిని ప్రపంచించలేదు. విప్లవమని భావించే కవి, బాపురెడ్డిగారి వీరవిజ్ఞాన విప్లవపర్వాన్ని విరసంగా విమర్శించవచ్చు. బాపురెడ్డిగారు విభిన్న ధోరణులమధ్య సరసంగా జీవించటమే, సమన్వయాన్ని సాధించటమే నేటి సమాజ జీవిత తత్త్వమని గాఢంగా విశ్వసిస్తారు. వర్గ సంఘర్షణ సామాజికంగా వాస్తవం కావచ్చు. కాని, సంఘర్షణనుండి సమాజాన్ని శాంతివైపు నడిపించే మానవ యత్నంకూడా వాస్తవమే. అయితే ఆ యత్నం సాయుధ పోరాటంద్వారా కాకుండా, శాంతి సమన్వయావగాహనలద్వారా సాగించాలని విశ్వసించే రచయిత డా॥ బాపురెడ్డి. ఆయన చెప్పే 'భావభౌతికసత్యయోగం' ఆయన రచించే కవిత్వాన్ని అన్వయించుకోటానికి అనువైన సూత్రం.

అనుభూతికి వచ్చే శ్రేయోభావాలన్నీ భౌతికసత్యాలవంటివనే వారు నమ్ముతారు. సమాజ శ్రేయస్సును కోరి ప్రభుత్వంకానీ, ప్రజాహిత సంస్థలుకానీ, పార్టీలుకానీ, వ్యక్తులుగానీ కొన్ని క్రొత్త క్రొత్త పద్ధతులను, విధానాలను, సూత్రాలను, సంస్కరణలను, పథకాలను ప్రవేశపెట్టవచ్చు. సమాజజీవనంలో అవి భాగమైపోయినప్పుడే వాటికి సార్థక్యం. ఉదాహరణకు-వరకట్నం తీసికోవటం జాతి నైతికపతనానికి చిహ్నమని పెద్దలూ, పిన్నలూ, ప్రభుత్వమూ అందరూ అనేమాటే. కాని, అది మాత్రం జీవితంలో ఆచరణంగా పరివర్తనం చెందటంలేదు. అది భావసత్యంగానే ప్రజలు గ్రహిస్తున్నారు కాని, భౌతికసత్యంగా కాదు. 'వరకట్న నిషేధం' ఎంత భావసత్యమో అంత భౌతికసత్యంకూడా. భావసత్తాను అంగీకరించే జాతి భౌతిక సత్తాను అంగీకరించటం లేదు. ఆచరిస్తే అభ్యుదయం కలుగుతుందని భావించే సత్యాన్నే ఆచరించటంలో జాతి వెనుకంజ వేస్తున్నది. ఈ ద్విపాత్రాభినయం రాజకీయంలోనూ, సాంఘికంలోనూ, సాహిత్యంలోనూ చాలామంది ప్రయోగిస్తున్న కళ. చిత్తశుద్ధిలేని ఈ విచిత్ర ప్రవృత్తులవల్ల భావానికీ, భౌతికానికీ యోగం లేకుండా పోతున్నది. ఆలోచించిందే ఆచరించాలి. ఆచరించటానికి అనువైన ఆలోచనకూడా చేయాలి. మానవుడెన్నో ఆదర్శాలు చెప్పవచ్చు. ఆదర్శాలను ఆచరణ సత్యాలుగా మార్చగలిగిన అవగాహననూ, కళామార్గాలనూ అన్వేషించుకోవాలి. కవిత్వం ఆనందదాయకమైన అవగాహనను అందించాలి. భావసత్యాన్ని భౌతికసత్యంతో యోగింపచేసేదే కవిత్వం-ఇది బాపురెడ్డిగారి సాహిత్య దృక్పథం.

"అగ్గిపుల్లకన్నా
అణుబాంబు గొప్పకాదు
అంటించటానికి అవసీగోళాన్ని-
రోడ్డు ప్రయాణంకన్నా
రోదసీయాత్ర గొప్పకాదు
చేరటానికి మారణ రణరంగాన్ని-
కాకిఅరుపులకన్నా
కమ్యూనికేషన్ సాటిలైట్లు మిన్నకాదు
ప్రసారం చేయటానికి ద్వేషాన్ని-"

ఈ మాటలంటున్న బాపురెడ్డిగారు తెలుగులో కవిత్వం వ్రాస్తున్న విశ్వ చైతన్యంలా గోచరిస్తారు. ప్రపంచంలో ప్రతిధ్వనించే ప్రజాజీవిత తరంగాలకు స్పందిస్తూ కవితాగీతికల నాలపించే స్నిగ్ధప్రవృత్తి జె. బాపురెడ్డిగారిది. చాటుగా చెప్పటంకంటె ఘాటుగా చెప్పటమే ఆయనకు ఇష్టం. అందుకే-

"చాటుగా సంప్రదాయబద్ధంగా కాక
ఘాటుగా బల్లెపు పోటులా
సత్యం చెప్పినందుకు తిట్టబోకు"

అని సాహితీలోకాన్ని సంబోధించి చెప్పారు.

కవిత్వం వ్రాసే ప్రతి కవీ తనకు కవిత్వాన్ని గురించి ఉన్న అభిప్రాయాలనూ, స్వీయకవిత్వగుణాలనూ వివరించడం నే డొక పరిపాటి అయింది. అయితే, కొందరు తమ కవితా లక్షణాలకు లక్ష్యాలు వ్రాసి చూపించి సెబాసనిపించుకొంటారు. మాటకూ చేతకూ, భావానికీ భాషకూ సమన్వయాన్ని సాధించుకొంటారు. చాలామంది ఆ రెండింటికీ వారధిని కట్టటానికిబదులు రెండింటికీ నడుమ వారిధినే కల్పించుకొంటారు. అన్వయం కుదరని అభివ్యక్తి బాపురెడ్డికి గిట్టదు. ఆధునిక కవిత్వంలో "భావం, భాషను తరిమేస్తున్నది; భాష, భావాన్ని వదిలేస్తున్నది; విప్లవావేశంలో వెర్రి ఆక్రోశంలో, విడిపోయిన భాషాభావాలు, ఒకటినొకటి వెలివేస్తున్నది" అని ఘాటుగా, బల్లెపు పోటుగా చెప్పి, 'భాషాభావాలకు రాగరసానుబంధం' వేయటం తమ కవితా లక్ష్యమని బాపురెడ్డిగారు పేర్కొన్నారు. 'రసజ్ఞుని విజ్ఞప్తి' నిజానికి రచయిత విజ్ఞప్తియే. కవితలో శబ్దానికుండదగిన స్థానాన్ని నిపుణంగా నిర్దేశించారు బాపురెడ్డిగారు.

"గాడిదమీద మూటలు మోయించినట్లు
కవితతో మాటలు మోయించకు !
బాలపల్లవ కోమల వాగ్దేవితో
బస్కీలు తీయించకు ; కుస్తీలు పట్టించకు."
"భావం అనే కళ్లెం త్రెంపుకొని
పరుగెత్తే మాటల కవిత్వపు గుర్రం
కలిగించేది-కాదు రసానుభూతి
కళ్ళూ ఒళ్ళూ మండించే
ధూళి ధూసర విభూతి."

శబ్దసారళ్యం, అభివ్యక్తి మాధుర్యం, భావసంయమనం, అనుభవ పారవశ్యం - ఈ నాలుగూ శ్రీ బాపురెడ్డిగారి కవితకు చతుర్భుజాలు. వారి కవిత 'కోమలవాగ్దేవి'.

బాపురెడ్డిగారితో నాకు మూడు దశాబ్దాల పరిచయం. విద్యార్థిగా నిజాం కళాశాలలో పద్యాలను హృద్యంగా శిల్పీకరిస్తున్నప్పుడు తెలుసు; ప్రయోక్తగా గేయ నాటికలకు రంగరంగ వైభవాలను కల్పిస్తున్నప్పుడు తెలుసు, జాతిజీవన రేఖాచిత్రాలను పచనవితావర్ణాలతో అలంకరిస్తున్నప్పుడు తెలుసు; కలెక్టరుగా తెలుసు; కళాకారుడుగా తెలుసు; ఆఫీసరుగా తెలుసు; ఆర్ద్రహృదయుడుగా తెలుసు; మనిషిగా తెలుసు; మనీషిగా తెలుసు. కారులో పోతున్నా, రహదారి బంగళాలో విశ్రాంతి తీసుకొంటున్నా, విమానయానం చేసినా, వినోదయాత్రకు వెళ్ళినా, సొంతయింట్లో కాసింత విరామం దొరికినా, మిత్రులతో ఒకింత అవకాశం దొరికినా సాహితీవ్యాసంగంలో మునిగిపోయే రసజ్ఞుడు ; మాటల్లోనుండే కవితాసామగ్రిని స్పష్టించగలిగిన కళావేత్త ; ఎప్పుడూ ఔచిత్యం వీడని ఉన్నతుడు.

బాపురెడ్డిగారి కవితను తెలుగునాట ఇప్పుడు ప్రత్యేకంగా పరిచయం చేయవలసిన పనిలేదు. ఆయన ఆధునిక కవులలో ఒక ప్రత్యేక స్థానాన్ని గడించుకొన్న గడుసువాడు. భయంలేకుండా భావభౌతిక సత్యాలను ప్రకటింపగలిగే ప్రజ్ఞానిధి శ్రీ బాపురెడ్డి. "మన చేతుల్లోనే ఉంది"-అనే ఈ కవితా సంపుటి శీర్షిక బాపురెడ్డిగారి జీవితసూత్రాన్ని వ్యంజింపచేస్తుంది. ఆయన దృక్పథంలో కవిత్వం జీవిస్తున్న అనుభవం. అనుభవాన్ని అమృతంగా మార్చుకోవటంగాని, గరళంలా మార్చుకోవటం

కాని, మనచేతుల్లోనే ఉంది. జీవితంలో జీవింపగలగటం నేర్చుకుంటే కవిత్వంలో అనుభవించటం కరతలామలకం. అందుకే--

"అనుభూతుల్ని పెంచుకోవటం
అనుభూతుల్ని పంచుకోవటం
నా జీవితానికి ఆశయం"

అంటారు బాపురెడ్డి గారు.

శ్రీనాథునికి వలెనే ఈయనకూ ఒక మంచి అలవాటు ఉంది. చూచిన రమణీయ సన్నివేశాన్ని, పొందిన రసమయానుభూతినీ చాటువుగా, స్వాదువుగా కవితలో ఆలపిస్తారు. దానికి తోడు బాపురెడ్డి గారు బహురాష్ట్రాలనే కాక, బహు దేశాలను కూడా దర్శించారు. ఆయన దర్శించిన పట్టణంగానీ, ప్రదేశం కానీ ఆయన కవితా దర్శనంలో వర్ణనీయంగా ప్రతిఫలించాలిసిందే. ఈ సంపుటిలో "విదేశయాత్రలో స్వదేశ స్పందనం" - ఈ ప్రవృత్తికి నిదర్శనం. ఇది ఒక కవిత్వ ఛాయాచిత్రాల ఆల్బం.

"గుండె కెమేరా విప్పి
ఊహల స్విచ్ నొక్కి
అదృశ్యాలను ఫోటో తీసుకున్నాను"

అని చెప్పారు. ఇందులో చిత్రవిచిత్రమైన భావచిత్రాలున్నాయి.

"రోదసీ యాత్రికునికి ధరిత్రిలాగ
రోం నగర యాత్రికునికి చరిత్ర
కాలపు మైదానంలో జాలిగా పడిఉన్న
బంతిలా భాసిస్తుంది"--

అనంత కాలాల్ని రేంజిగా పెట్టుకొని, ఏరియల్‌లో నుండి తీసిన దార్శనిక భావచిత్రం ఇది. ఇది భావకవిత్వం కాదు; బాపురెడ్డి కవిత్వం.

"ఇగ్లండు ద్వీపం -- చరిత్రలో ఆరని దీపం"

ఒక చిన్న క్లోజప్ చిత్రం.

మన రాష్ట్రంలో ఆయన చూడని విశేషం లేదనుకుంటాను. చూచిన వాటినన్నీ కవితల్లో చాటుసుందరంగా వర్ణించి చెప్పారు. మచ్చుకు ఒకటి – విశాఖపట్నం లైట్ హౌస్.

"చీకట్లను ఛేదించుకుంటూ
చూస్తున్నది దూరదూరాలకు
ప్రియుని కోసం వేచియున్న ప్రియాంగన
కళ్ళన్నీ దివిటీలు చేసుకొని
కలయ చూస్తున్నదేమో అన్నట్లు".

మనం ఈ కవితను చదివినప్పుడు అవ్యక్తంగా మన మనసులో ఏర్పడ్డ ఒక అనుభూతిని ప్రతికించే భావచిత్రంగా భాసిస్తుంది. బహుశః — భవిష్యత్ సాహిత్య చరిత్రకారులు తెలుగు దేశవైభవాలనూ, తెలుగు కవులు చిత్రించిన వైఖరినీ గురించి వ్రాయవలసి వస్తే బాపురెడ్డి కృతులు బంగారపు గనులు కాగలవనటంలో అనుమానం లేదు.

బాపురెడ్డి ఆధునిక కవిగా నిర్వచనాన్ని, నినాదాన్ని అభివ్యక్తి వాహికలుగా వాడుకోవటం గమనించవచ్చు. అదీ ఆయన చేతిలో ఉన్న పనే. కవిత్వంలో నిర్వచనాన్ని ఆత్మాభివ్యక్తికి, నినాదాన్ని ఆదర్శాభివ్యక్తికి ఉపకరణాలుగా ఉపయోగించటం సర్వ సాధారణం. నిలిచి చెప్పేది నిర్వచనం : పిలిచి చెప్పేది నినాదం. నిలిచిచెప్పటంలో నిగ్రహంతో కూడుకొన్న సూక్తిపాటవం ప్రకటిత మౌతుంది ; పిలిచి చెప్పటం లో ఎదుటివారిలో నిద్రాణమై యున్న చైతన్యాన్ని మేల్కొల్పి ప్రజ్వలింప చేసే ప్రతాపస్ఫూర్తి ప్రస్ఫుట మౌతుంది. నిర్వచనం నిండుకుండ; నినాదం నిర్ఝరి. నిర్వచనం పయోదమాలిక ; నినాదం వర్షధార. నిర్వచనం నడక; నినాదం పరుగు.

బాపురెడ్డి గారు రెండు పద్ధతులనూ సార్థకంగా ప్రయోగింప గలిగిన సవ్యసాచులు. ఉదాహరణకు – రూపకంలా భాసించే నిర్వచనం–

"సాయుధ విప్లవాలతో సాధించలేని
సంఘ సంస్కరణను

సాహితీ సౌరభాలతో
సాధించిన కీర్తి శృంగం -
కందుకూరి వీరేశలింగం"-

నినాద విధానాన్ని సూచించే నినాద కవిత:-

"వాదాలలో నలిపి
నినాదాలలో నలిపి
సత్యాన్ని అసత్యం చేయకండి
అహింసను హింసచేయకండి"

బాపురెడ్డి గారి కవితకు సూక్తి సామర్థ్యం ; ఉక్తి చమత్కారం వెన్నతో వచ్చిన విద్యలు. సూక్తికి --

"మనవలన మరోజీవుడు
జన్మించ లేకపోతే లేదు ముప్పు
పుట్టిన వాళ్లని
సుఖంగా అభ్యుదయోన్ముఖంగా
పోషించ లేక పోవటం క్షమించరాని తప్పు".

బాపురెడ్డి గారికి శబ్దంమీద ఎంత అధికారముందో, అభివ్యక్తి మీద అంత ఆధిపత్యం ఉంది. శీర్షిక దగ్గర నుండి చివరి వాక్యం వరకూ ఉక్తి నాశ్రయించిన శ్లేషనో, చమత్కారాన్నో, అలంకారాన్నో, అంత్యప్రాసనో, వ్యంగ్యోక్తినో ప్రవేశపెట్టి కవితలో మన మనస్సు సక్తమయ్యేటట్లు చేయగల శక్తి ఆయన ఉక్తికి ఉంది. మచ్చు కొకటి రెండు-

ముందు శీర్షికలను తీసుకొందాం. 'తాగిన సత్యం' : దీనికి - కోకిలకు మధువందిస్తే, హేమంతంలో కూడా కూస్తుంది" అన్నది వ్యాఖ్యానం. ఎన్నికలలో 'ఎన్ని-కలలో' అన్న శీర్షికలో సభంగ శ్లేష చమత్కారం. 'శవాలు లేస్తున్నవి' లో సస్పెన్స్. "ప్రజాశక్తి ప్రహ్లాదుడు" 'అస్థివేణువులు" 'విప్లవ పంచాంగం" ఇటువంటి రూపకాలు బాపురెడ్డి బ్రాండ్.

వచన కవితలో తాలిమెరుపులకూ, కొస మెరుపులకూ ఒక ప్రత్యేక స్థానం ఉంది. రచనా శిల్పాలుగా బాపురెడ్డి గారికి ఈ పట్టింపులు లేవు. కాని, అలవోకగా వచ్చినవి మాత్రం సహజాలంకారాల్లా శోభిస్తాయి వారి కవితలో.

“ఆకలి బాకులు పొడిచిన
అడవి కడుపులోనుంచి
చిమ్మిన రక్తపు బిందువులు
ఆమోదుగు పూలు”

అలంకారబలం దండిగా పూచిన కవితాలత ఈ ఖండిక.

“కత్తులతో పరీక్షలు వ్రాసిన విద్యార్థులు
ఇపుడు కలాలతో వ్రాస్తున్నారు”

అర్థవక్రతకు అనర్ఘమైన ఉదాహరణం.

“కొట్లాడు కోవటం తెలిసిన వాళ్లూ తెలుగు వాళ్లే
మళ్ళీ మాట్లాడు కోవటం తెలిసిన వాళ్లూ తెలుగు వాళ్లే
అని, తెలిసిన వాళ్లు పంపిన అభినందనలను
అందుకొన్న భారతీయులు తెలుగు వాళ్లే”.

ఇది వ్యంగ్యోక్తిగా విరబూసిన ప్రౌఢోక్తి.

“హైదరాబాదులో బలవంతుడు
అశోకవనిలో హనుమంతుడు”

చమత్కారంగా జాలువారే వక్రోక్తి.

“బాపు-
చీకట్లను చీలుస్తున్న తూపు
మనలను నడిపిస్తున్న ముందుచూపు”--

సార్థకంగా అలంకరించుకొన్న అంత్యప్రాసలు.

“నీవు చేస్తున్న
లోచన ప్రధానం
లోకన ప్రదానం”

శబ్దంలో చిగురించే అర్థ చమత్కారం.

“స్వాతంత్ర్యం అనగానే
సగం కడుపు నిండిన సామాన్య జనం

మరో నగం నింపుకోవటానికి
మట్టితో పోరాడుతున్నారు"
శక్తిమంతమైన వ్యంగ్యోక్తి.

బాపురెడ్డిగారు కవిత్వం, కవిత్వం కోసం వ్రాసిన వారుకారు. సమాజశ్రేయస్సుకై సత్కవితను వ్రాస్తున్నవారు. కవిత్వం మనిషికోసం కవిత వ్రాస్తున్న మనీషి బాపురెడ్డి.

"నా దేశ సమస్యలు నాకు తెలుసు
నా జాతి నాడి నాకు తెలుసు"

అని గుండె నిబ్బరంతో తనదేశ సమస్యలను, జాతి స్పందనలను కవితామయంగా చిత్రిస్తున్న కళాకారుడు శ్రీ బాపురెడ్డి.

ఒక బాపు నిర్మించింది నవభారతం
ఒక బాపు చిత్రించింది కళానీరాజనం
ఒక బాపు సృష్టించింది కవితానికేతనం.

జి. వి. సుబ్రహ్మణ్యం

'తెలుగు సాహితి'
హైదరాబాదు విశ్వవిద్యాలయం
హైదరాబాదు—500001

# గమత్తు జగత్తు

ఈ జగత్తు
గమత్తుగా ఉందినాకు
రాలిపోయిన పండుటాకు చోటు
ఖాళీ కానీయదు
మరో క్రొత్తఆకు
దేశాలమధ్య కలహాలకు బ్రేకు
పడనీయదు సరికొత్త సమస్యల్లో
తడియారని స్వార్థపుబాకు –

ఓ మనిషి తత్వ మో మనిషికి నచ్చదు
భీకరరవాల అమవసనిశిలో
ఏకాలంలో వెలుతురు విచ్చదు
మూడుపాళ్ళు నీళ్ళ భూగోళం
అణునిర్మిత సృష్టికి ప్రతిసృష్టి
మనిషి మేధలో గందరగోళం –

ఆకలి ఈ కలిజలధి కలచు గిరి
మృత్యురోగులై మందుకోసమై
మిత్రులటే పోతున్నారు–ఏటోమరి
ఫణికికూడ మల్లియలంటే సంబరం –
మనిషి మాట లో తెరిగిన తారామణులు
అతని పాటవిని దిగిరారు అంబరం
ఏమని చెప్పాలో తెలియడం లేదు నాకు
నాకం, నరకం, సౌఖ్యం, శోకం
కలిసిపోయినట్లుగా కన్పడతాయి నాకు
ఈ జగత్తు గమత్తుగా ఉందికదూ !

(1955)

# అభినవ భగీరథ

మండే ఈ ఆమని లోనికి
గుండె గాజుగుండా చూస్తున్నాను
భయంకరమైన ఈ అజ్ఞానపు కొండల్ని
నా మేధా మండలాన మండిస్తున్నాను
ఉండడానికి నీడలేక
లావా కొండపైనుండి మండి పడే
శిలాద్రవానికి
భూగర్భంలో స్థలం కల్పిస్తున్నాను-

ఈ నిశా శైలాంత గృహాంతరంలో
ఉషోరేఖల్ని చెక్కుతున్నాను
మండే జీవితాల గుండెలు చితికిపోయి
కళ్లలోయలగుండా
ఏళ్లుగా పారే కన్నీళ్లను
సమతాభ్యుదయ చంద్రుడు ప్రతిబింబించే
శాంతి సుధార్ణవంగా మలుస్తున్నాను-
చుక్కల కన్నెలకూ
విరహంతో కృశిస్తున్న మిత్రులకూ
మేఘాల పందిళ్లలో
చందమామ పెళ్లిపీటమీద
మలయ పవనుడు మంత్రం చదువుతుంటే
ప్రేమలు ముదరకమునుపే
పెళ్ళిళ్లు చేయిస్తున్నాను-

శిశిరాన్ని
నా బానిసగా వశం చేసుకుంటున్నాను
వసంతానికి
శాశ్వత వాసం ఏర్పరుస్తున్నాను
చింతకాయలురాల్చే సంగీతం సృష్టిస్తున్నాను
అంతా సంతోషంగా బ్రతికే తెరువు చూస్తున్నాను.

(1956)

# కుక్క-కావ్యవస్తువు

లోకమంతా నిద్రిస్తున్నది
చీకటి భీకరంగా చూస్తున్నది
నిర్భయంగా నీ గొంతు మాత్రం
నిశల చీల్చుక వినిపిస్తున్నది
నిద్రమాని నా మనస్సు
నిన్ను గూర్చి ఆలోచిస్తున్నది
కుక్కా! నీ చక్కని బ్రతుకు మీద
ఒక చిక్కని కావ్యం రాయాలనిపిస్తున్నది-

ఇంటింటుకి దినమంతా తిరిగితే
ఏ ఇల్లాలూ నీకు అన్నం పెట్టలే
"హడీ హడీ" అని పైగా
అదమాయించారు గదా!
ఎవరి బ్రతుక్కూ ఆశపడక
ఎట్లో జీవిస్తున్నావు గదా!
అయినా, ఈ ఊరిమీద నీకు
అంత ప్రేమ ఎందుకే?
పిల్లికి పిడచైనా వేయని
బొల్లిదొరల మేడల చుట్టూ
చెట్లలా తిరిగే నీడల్ని
చెదరగొడతా వెందుకే?
చీమ చిటిక్కుమంటేనే
"భౌ"మని లేస్తా వెందుకే?
మస్తుగా జీతం తిన్న
పోలీసువాళ్ళు
ఏ మూలనో కళ్ళు మూసుకొని
గురకలు పెడుతుంటే
పట్నాల్లో మామూలుగా

సరఖా"లు జరుగుతుంటే
జీతం బత్తెం లేక నీవు
జీవితాంతం సేవ చేయడం చూస్తుంటే
మనుషు లనబడే వాళ్లకంటే, నీకే
ఓ నమస్కారం చేయాలనిపిస్తూంది.

పోలీసు గార్డులు - డేంజర్ బెల్లులు
ఏవీలేని ఈ పల్లెటూళ్ళల్లో
నీవేకాని లేక పోతే
నిజంగా ఎంత భయంకరంగా ఉండేదో ?
నీవు
ఎక్కడ కాపురం చేస్తున్నావో
నీ పిల్లలూ నీవూ
ఎలా బ్రతుకుతున్నారో
హరిహరీ ! ఆ శ్రీహరికే ఎరుక
ధనాంధులైన మనుషులకేమెరుక ?
నమ్మినవాళ్లను మోసగించడం
న్యాయం అయిపోయిన ఈ రోజుల్లో
అన్యాయానికి
న్యాయం అర్పిస్తున్నావా ?
అవిశ్వాసానికి
విశ్వాసం సమర్పిస్తున్నావా ?
క్రూర మృగాలకు-చోర మృగాలకు
శత్రుడవు నీవు
కృతఘ్న లోకానికి సైతం
కృతజ్ఞత చూపే మిత్రుడవు నీవు !
నిన్ను చూచి లోకం నేర్చుకోవలసింది
నిజంగా ఎంతైనా ఉంది
నాకు మాత్రం నిన్ను చూస్తే
నమ్మ బాధాకరంగా ఉంది.

(1956)

# విశాఖ లేఖ

ఆమధ్య మనం
హైదరాబాదులో కలసి కొన్నప్పుడు
"ఆబిడ్స్"లో సరదాగా
కబుర్లు చెప్పుకున్నప్పుడు
నీవు నన్నడిగావు –

"విశాఖపట్నం విశేషాల గురించీ
అక్కడి ప్రజల జీవితాల గురించీ
కవిగా నీవు పొందిన అనుభూతుల్ని
కావ్యంగా ఎందుకు రాయకూడదూ" అని
నిజంగా –
విశాలమైన విశాఖపట్నం
సుందరమైన కావ్య వస్తువు
అందీ అందని ఆనందాల
విందులకు ఆటపట్టువు.

"సింహాచలం కొండ"ల ప్రక్కన
చల్లని పిల్లగాడుపులు సేవిస్తూ
ప్రక్కనున్న సాగర సంగీతంలో
పరవశమై తేలిపోయే
నిత్యనూతన సముల్లాసిని
విశాఖపట్నం సుహాసిని !
చెప్పుకోదగ్గ విశేషాలు
చూడదగ్గ అలంకారాలు
చాలా ఉన్నాయి ఇక్కడ
అన్నిటికీ సముద్రతీరం
ఆరిపోని జీవనరేఖ.

మనచేతుల్లోనే ఉంది

సాయంకాలం బీచిమీద
సరదాగా సాగిపోతూ ఉంటే
కలకల అలలపై తేలినట్లుంటుంది :
పొంగినట్లే పొంగి,
తక్షణమే క్రుంగిపోయి
నిస్సహాయంగా పొరలుతూ
నిమిషంలో విరిగిపోయే తరంగాలు
జీవిత మహార్ణవంలోని
తృటి కాలపు జీవులకు ప్రతిబింబాలు.

జగత్తంతా ఆవరించినవాడు
అగాధమైన హృదయం కలవాడు
మహాశక్తి సంపన్నుడు ఈ సాగరుడే
ఇంతగా ఆఘోషిస్తుంటే
అనిపిస్తుంటుంది –
ఎంతటి మహాత్మునికైనా శాంతిలేదని,
మనశ్శాంతి లేదని :
ఎవరో వెంటబడి తరుముతున్నట్లు
పరుగెత్తి వచ్చే కెరటాలు
అడ్డంగా నిల్చిన తీరాన్ని దాటలేక
నురుగులు గ్రక్కుతూ పడిపోయే దృశ్యాలు
గుండెల్ని కరిగించి వేస్తాయి
బ్రతుకులోని పరిమితుల్ని జ్ఞాపకం చేస్తాయి –
అనంతకాలం వలెనే
అంతులేని సాగరమంతా
ముందు నిల్చి వున్నప్పటికీ
ఎంతో దూరం చూడలేం ఈ తీరం నుండి :

వినే వుంటావు నీవు
బీచిలోని స్కాండల్ పాయింటు గురించి

ఈ మధ్యే కట్టారెక్కడ
అందమైన ఒక పబ్లిక్ పార్కు —
అమ్మాయిలూ, అబ్బాయిలూ
అతిథులూ, పథికులూ
దంపతులూ, స్నేహితులూ
అడుక్కునే వాళ్లూ, అమ్ముకునేవాళ్ళూ
అంతా చేరుకొనే చోటు
బ్రతుకులోని బాధల్ని తప్పుకోవడానికి
మనసులోని మాటల్ని చెప్పుకోవడానికి
అనురాగాలు పెంచుకోవడానికి
ఆనందాలు పంచుకోవడానికి
అనువైన చోటు.

అల్లంత దూరాన,
యారాడ కొండమీద
'లా' వ్యాలీకి ప్రక్కన గల
లైట్ హౌసు
చీకట్లను ఛేదించుకుంటూ
చూస్తున్నది దూర దూరాలకు
ప్రియునికోసం వేచి ఉన్న ప్రియాంగన
కళ్ళన్నీ దివిటీలు చేసుకొని
కలయ జూస్తున్నదేమో అన్నట్లు.

విశాఖపట్నం 'ఓడరేవు'
విశ్వ విఖ్యాతమే గదా ?
సహజ సౌందర్య విలసిత మది
సౌభాగ్యానికి సంకేత మది.

ఎన్నో బళ్ళల్లో తెచ్చిన సరుకుల్ని
ఇట్టే లాగేస్తుంది లారీ,

మనచేతుల్లోనే ఉంది

లెక్కలేని లారీలు మోసి తెచ్చిన బరువుల్ని
వెన్నుపై వేసుకొంటుందొక ట్రెయిను,
ఎన్నో ట్రెయినుల సంభారాన్ని
ఒడిలో వేసుకు పోతుంది ఓడ;
కొండలా కదిలి పోయే ఈ ఓడల్ని చూస్తుంటే
నా కేమనిపిస్తుందంటే —
ఒకణ్ని మించిన వాడొకడు
ఉండనే ఉంటాడీ లోకంలో-అని.

ఓడరేవు కట్టుప్రక్కన ఉంటుంది షిప్‌యార్డు,
ఓడల నిర్మాణానికి ఒకే ఒక్క కర్మాగారం;
నవభారత బృహచ్ఛక్తి భాండాగారం!
భారతీయ కార్మిక వీరులు
భారీ యంత్రాలను చేబట్టి,
నిరంతర శ్రమానలంలో
నిండు దీక్షా విద్యుజ్జ్వాలల్లో
ఉక్కును కరిగించి ఓడలు నిర్మిస్తుంటే
ఒళ్ళు నిలువునా పులకిస్తుంది,
ఆశా వృక్షం చిగురిస్తుంది -
హనుమంతుడు సంజీవినీ పర్వతాన్ని ఎత్తినట్లు
అంత ఎత్తుగా నిల్పిన "క్రేన్లు"
అనేక టన్నుల బరువుల్ని
అవలీలగా ఎత్తి పారేస్తుంటాయక్కడ -

ప్రజల్ని తరతరాలుగా పీడిస్తున్న
క్షుద్రదేవత బండతలను
గుద్దులు కొడుతున్నట్లుంటుందక్కడ
పనివాని ప్రతిసుత్తిదెబ్బ!

"విశ్వశాంతి" "విశ్వమాయ"
విశిష్టమైన ఓడలు ఎన్నో
ఇక్కడే వెలువడ్డ రత్నాలు,
భరతమాత గళహారంలోని ప్రగతి మాణిక్యాలు!

ప్రక్కనే ఉంది "కాల్‌టెక్స్"
నూనెశుద్ధి కర్మాగారం
మోటారు బళ్ళ బ్రతుక్కి
దైనందిన జీవనాధారం!
చెడు రక్తాన్ని స్వీకరించి
జీవన యంత్రాన్ని నడిపే
మంచి రక్తాన్ని బహూకరించే
గుండెకాయలాగ!
కాల్‌టెక్స్ క్యాంటీన్‌లో
ఐస్‌క్రీం తిన్నవాడు
విశాఖపట్నం మాధుర్యం ఎన్నటికీ మరువలేడు!

ఇక్కడే ఉందొక "నేవల్ యూనిట్"
భారత నౌకాదళ శిక్షణ కేంద్రం
పవిత్ర భారత తీరాలను
ప్రాణప్రదంగా రక్షించడానికి
నౌకా బలంలో చేరిన
యువక వీరుల శిక్షణ కేంద్రం!
తెల్లని పావురాల్లాంటి
ఆ నౌకాబల బాల వీరులు
విన్యాసం చేస్తున్నప్పుడు
శాంతి వెల్లివిరిసిన ట్లుంటుంది.

ఊరికి పశ్చిమాన
ఉన్నాడు 'సింహాచల అప్పన్న'

అందరికీ కావలసిన దేవుడు
ఆపత్కాల బాంధవుడు,
చల్లని కొండమీద కూర్చుని
సహస్ర వసంతాలుగా -

పేదలకూ, సాదలకూ
పెద్దలకూ, పిన్నలకూ
కాలనడచి వెళ్ళేవాళ్ళకూ
కారుల్లోపోయే వాళ్ళకూ
అందరికీ అందుబాటులో ఉన్న
అద్భుతమైన దేవుడు
చందనం మైనిండా పూసుకున్న
సుందర వరాహ నరసింహుడు -
ఈ స్వామికే శ్రీకృష్ణ దేవరాయలు
రత్నాభరణాలు సమర్పించాడు,
కళింగ దేశాన్ని జయించాడు.

అనేకమంది మేధావులు
అధ్యక్షులుగా వెలసిన
ఆంధ్ర విశ్వ విద్యాలయం
అలంకారం ఈ నగరానికి : -

ఓ ప్రక్క సాగర గంభీరత్వాన్ని
మరోప్రక్క కొండల ఔన్నత్యాన్ని జీర్ణించుకొని,
విజ్ఞాన సౌరభాన్ని వెదజల్లుతూ
శాఖోపశాఖలుగా విస్తరిస్తున్న
విశ్వకళా విజ్ఞాన కల్ప తరువు.
విద్యా మహాసాగరాన్ని మథిస్తున్నారు
విజ్ఞాన సుధాభాండాల్ని వెలువరిస్తున్నారు

వివిధ కళాకమల్ని ఆరాధిస్తున్నారు
భావిభారత నిర్మాణానికి
బాటలు వేస్తున్నారిక్కడ :

విశాఖపట్నం మాట వచ్చినప్పుడు
విస్మరించడానికి వీల్లేంది
'కింగ్ జార్జి హాస్పిటల్'
చావులకు పుట్టుకలకు సామాన్యమైన చోటు
స్వర్గమూ, నరకమూ కలిసి మెలిసి సంచరించే చోటు :
వందలాది డాక్టర్ యోధినీ యోధులు
ఎందరెందరివో ప్రాణాలు రక్షించడానికి
యమునితో దివారాత్రాలు
సంకుల సమరం చేస్తుంటారిక్కడ ;
కాలపాశాన్ని "స్టెతస్కోపు"తో ఎదిరించి
మందు, గుండు, అస్త్ర, శస్త్రాలు ప్రయోగించి
పోరాడుతుంటారు నిరంతరం :
విజయం యమునిదే ఐనప్పుడు
వీరస్వర్గం పొందుతాడు రోగి.

చెప్పడం మరిచాను
చేపలవాళ్ళ సంగతి
అందమైన చందమామ ముఖంలోని
నల్లని మచ్చ వలె
అక్కడక్కడ ఉన్న మురికి వాడల్లో
గాలీ వెలుతురూ దర్శనమీయని
గుడిసెల్లో గదుల యెడదల్లో ఉంటారు వీళ్ళు,
సముద్రం ప్రక్కనుంచేనేగాని బ్రతుకలేని వాళ్ళు –
సాహసించి
పందెపు గుర్రాల్లా పరుగెత్తుకొనివచ్చే కెరటాలపై దూకి,
సాగర గర్భంలోకి స్వారీ కదురుతారు వీళ్ళు:

అడవిలోని జంతువుల్ని
కడలిలోని చేపల్ని
వేటాడుతాడు మానవుడు,
మానవుణ్నే వేటాడుతుంది మృత్యువు :
లోకంలో వేల వేల వేటలు
అన్నీ మృత్యుముఖంలోకి బాటలు.

విశాఖపట్నం జీవితం
విచిత్రంగా ఉంటుంది
అందమైన పరిసరాలు
అవసరమైన సరదాలు
అన్నీ ఉన్నాయి గాని —
పచ్చనోట్లు జేబులో ఉంటేనేగాని
పచ్చి మంచినీళ్ళు కూడా పుట్టవు ఇక్కడ –

కాపురాలు పెట్టడానికి కావలసిన ఇళ్ళు దొరక్క
పుట్టింటిలో భార్యా పిల్లల్ని వదలి పెట్టి
పూటకూటి ఇళ్ళల్లో భోజనాలు సహించక
ప్రక్క యిళ్ళ కిటికీలకేసి
పళ్ళ రసాలు మింగుతూ చూసేవాళ్ళు
విశాఖపట్నం అంటే కాస్తా
విసుక్కోవడం సహజం
కూడు సమస్యకంటే ఇక్కడ
గూడు సమస్యే దొడ్డది
పెరిగిపోతున్న జనాభా తెచ్చిన
పెద్ద సమస్యలోకల్లా పెద్దది.
ప్రజల్లో వేల రకాలు ఉన్నారు
కూలీనాలీ చేసుకొనేవాళ్ళు —
పరిశ్రమల్లో చెమటోడ్చే కార్మికులు

వ్యాపారస్తులు, ఉద్యోగస్తులు
అందులో ఎన్నెన్నో అంతస్తులు —
వస్తులుండేవాళ్ళుంటారు
మత్తుగా తినేవాళ్ళుంటారు
ఎంత కలిగినా తృప్తి లేక
ఏడ్చేవాళ్ళు కొందరు
ఉన్నా లేకున్నా హాయిగా
ఉండే ఆశా జీవులు కొందరు,
అందరి జీవితాల్లోనూ
ఏదో ఒక
అందమూ ఆనందమూ ఉంది.
సాధక బాధకాలు కూడ
సమానంగానే ఉంటాయి అందరికీ
అసమానత మాసిపోతేనే
అందరికీ నిజమైన ఆనందం –

కావలసినన్ని క్లబ్బులున్నాయి ఇక్కడ -
పగలంతా పనిచేసి అలసిన పెద్దవాళ్ళు,
భగవంతుడిచ్చిన డబ్బుగలవాళ్ళు,
తమసమస్యల బరువుల్ని దించుకోవడం కోసం
తరిగిపోయే యౌవనాల్ని పుంజుకోవడం కోసం
బ్రతుకు 'బ్యాటరీని' మళ్ళీ మళ్ళీ ''చార్జి'' చేసుకోవడం కోసం
కావలసినన్ని 'రిక్రియేషన్ క్లబ్బు' లున్నాయిక్కడ
బ్రతుకు బాధల్ని విస్మరించి
ప్రమోదాల సుధల్ని సేవించి
పరవశులై ఆడుతారు
ఎదలు విప్పి పాడుతారు
ఇంద్రలోకాల్ని క్షణకాలం ఏలుతూ ఉంటారు.

చెప్పాలంటే గ్రంథం చాలా ఉంది
ప్రతి వస్తువులోనూ కవితా సౌరభం ఉంది
మళ్ళీ మనం కలసికొన్నప్పుడు
మాట్లాడుకుందాం అన్ని సంగతులూ
మరి, సెలవా — (1963)

# అభయం

కలలూ, కళలూ పూచిన
కాశ్మీర దేశమా !
ఇలా రమణి పెదవిమీద
వెలిగే దరహాసమా !
నీ పేరు వినగానే నాలో
నిర్మల నీహారం కురుస్తుంది
నీ రూపు కనగానే నాలో
నిర్జర సుమహారం మెరుస్తుంది –

దానవతా గర్జలకు నీవు
ధైర్యం వీడిపోవద్దని
సంకుచిత ద్వేషాగ్నులకు నీవు
సమిధ వై పోవద్దని
మానవలోకం పక్షాన
భారతమాత సమక్షాన
మరీ మరీ చెబుతున్నాం –

స్వచ్ఛమైన హిమాచలంవంటి
చల్లని నీ బ్రతుకులో
శారద హిమకరుని వంటి
నీస్వాతంత్ర్య సుధా పాత్రలో
వినీల దాస్య విషంపోసే
విద్రోహుల కరాళ కంఠాలను
శీతగిరి శిఖరాలవలె శిరస్సులెత్తి
చిందులుగా నరికేస్తామని
భారతమాత సమక్షాన
ప్రతిజ్ఞచేసి చెపుతున్నాం –
మానవతా పక్షాన
మరీ మరీ చెపుతున్నాం –

నీ పూల గుండెల లోయల్లో
జాలువారే మా స్నేహ పరిమళం
విశ్వమానవ జీవన వీధుల్లో
విశాలభావ వీచులైనవి
సామ్యవాద సహజీవన
భారత సంస్కృతి చరిత్రలో
శాశ్వత కాంతి రేఖలైనవి -

రాజుల, సామ్రాజ్యవాదుల
నియంతల, రణహంతల
తలదన్నిన స్వేచ్ఛామణివీవు
కోటి కోటి భారత జనతకు
కుచ్చుల తురాయివైనావు -

శ్వేతకపోత సుందర కిరణాల
నీ మంచుమల చేలాంచలాలు
జాతి మత వైషమ్యాలు చిందే
రక్తంచే సిక్తం కానీయం
మృదు మధుర కిలకిలారావాల
నీ ఆమనుల వనాంగణాలు
భీకర శతఘ్నుల కర్ణకఠోర
ఘోషలతో ఘూర్ణిల్ల నీయం.

నీ జీవిత మల్లికావనంలో చొచ్చి
బుసకొట్టే శత్రు ఫణాలను
శాంతిసమర సర్ప యజ్ఞంలో
సజీవదహనం చేస్తామని
స్వతంత్ర భారతి సమక్షంలో
ప్రతిజ్ఞచేసి చెపుతున్నాం.

(1966)

# తాగిన సత్యం

తాగినవాని మనస్సు
దర్పణం లాంటిది
అందులో అతని
అనుభూతుల్ని - ఆలోచనల్ని
స్పష్టంగా చూడవచ్చు -

ఆత్మ దక్షుంగా తాగినవారితో
అసత్యం పలికించలేం
నిజంగా తాగినవాని
నిజరూపం కప్పి పుచ్చలేం
కాబట్టి
తాగిన సత్యం-దాగని సత్యం.

తాగేది మనిషికాదు
అతని మనస్సు
తప్పేది మనిషిమతికాదు
అతని అహంకృతి ;
మద్యపానం నిజానికి
మనిషిని మార్చలేదు
అతని బాధలను సమస్యలను
అక్షరాలా తీర్చలేదు-

చెప్పదలచుకున్నదేదో ఉంది
సిగ్గుపడుతున్నవాడు
చేయదలచింది ఏదో భయంతో
చేయలేక పోతున్నవాడు

కంఠదఘ్నంగా తాగగానే
ఘంటాపథంగా చెప్పేస్తాడు
అనుమానం, బిడియం, భయం అధిగమించి చేసేస్తాడు :
కవిత రాయగల్గినవాడు కలంపట్టి రాస్తాడు
పాటపాడగల్గినవాడు క్రేటుకొని పాడుతాడు
ఛలోక్తులు విసరగల్గినవాడు భలేగా మాట్లాడుతాడు
తాత్త్వికచింతన కలవాడు తత్వమేదో చెపుతాడు
ప్రతిభ అనేది ఏదైనా ఉంటే ప్రస్ఫుటంగా ప్రకటిస్తాడు -

హంతకుడు తాగినతర్వాత
హత్యచేయ ఉపక్రమిస్తాడు
గిట్టని వాళ్ళను తిట్టడానికి
తిట్టిన వాళ్ళను కొట్టడానికి
గట్టిగా ప్రయత్నిస్తాడు.
రొమాంటిక్ లక్ష్మలక్షణుడు
రోమియో అయిపోతాడు.
సారాంశము ఏమిటంటే
సారా మనసారా త్రాగినవాని
ప్రతిభ పదిరెట్లు ప్రకాశిస్తుంది
ప్రవృత్తి విచ్చలవిడిగా విహరిస్తుంది
అంతేకాని
లేనిగుణంరాదు-ఉన్నగుణం పోదు
అయితే
ఎందుకుతాగాలి ? ఎవ్వరుతాగాలి ? ఎప్పుడు తాగాలి ?
అనే మూడు ప్రశ్నలు ముందు నిల్చుంటాయి -
పిల్లి కల్లు తాగితే పులిలాగ ఫీలౌతుంది
ఎలుకల్నే కాదు
ఏనుగుల్ని కూడా వేటాడగల ననుకుంటుంది
విలాస పంతుడు విస్కీతాగి

మనచేతుల్లోనే ఉంది

ఇంటికివస్తే పరవాలేదు
హీరో అనిపించుకుంటాడు
కాని పక్కింటికో
తన కిష్టమున్న ఇంటికో పోతే ప్రమాదం –
కోతికి బ్రాందీ ఇస్తే
గీతా పారాయణం చేయదు
కొంపలంటిస్తుంది
కోకిలకు మధువందిస్తే
హేమంతంలో కూడా కూస్తుంది
ఉత్తమ గుణాలున్నవాడు
మత్తుగా తాగడం మంచిది
చేతగాని వానికి మధు పానం
ఈతరానివానికి సాగర ప్రవేశం –

బీరు ఉద్రేక పరచేది
భీరుని కాదు–ధీరుని
రమ్ము రగిలించేది
రాళ్ళనుకాదు–రసాత్మలను–

ఉన్న శక్తి చాలనప్పుడు
ఊతగా ఉపయోగిస్తుంది మధువు
ప్రేరణ గాలిలా వీచనప్పుడు
వీవనలా పనిచేస్తుంది మధువు
మధుపానం
ఎవరికి, ఎప్పుడు, ఎందుకు అవసరమో
వారు, అప్పుడు, అందుకు నిర్ణయించుకోవాలి
నాకు మాత్రం ఈ మధ్య దేనికీ
లోపం కనిపించటంలేదు
అందుకే నాకు తాగవలసిన
అవసరం అగుపించటంలేదు.

# రసజ్ఞుని విజ్ఞప్తి

మాటలు మరీ బాగావస్తే
మతిపోయే ప్రమాదం ఉంది
అన్నిట్లో అర్థం లాగదీయ జూస్తే
ఉన్నర్థం పోయే ప్రమాదం ఉంది.

వేదిక లెక్కే కవీ !
ఈ రసజ్ఞుని విజ్ఞప్తి కాస్త వినిపించుకో
ఆ తర్వాత ఏదైనా రచించు వినిపించు
అయితే భూతదయ కాస్త పెంచుకో –

గాడిదమీద మూటలు మోయించినట్లు
కవితతో మాటలు మోయించకు,
బాలపల్లవ కోమల వాగ్దేవితో
బస్కీలు తీయించకు, కుస్తీలు పట్టించకు !

మార్దవంగా ఉందని భ్రమించి
గార్దభగళం సారించి
చేయబోకు స్వామీ పొల్లు కావ్యగానం
తీయబోకు మా అమాయిక ప్రాణం.

భావం అనే కళ్ళెం త్రెంపుకొని
పరుగెత్తే మాటల కవిత్వపు గుర్రం
కలిగించేది–కాదు రసానుభూతి
కళ్లూ ఒళ్లూ మండించే
ధూళి ధూసర విభూతి.

నిఘంటు పర్వతాలపై కెక్కి
మా పూల గుండెల లోయల్లోకి
గెల్లా లాగ శబ్ద శిలలను
గిరగిర దొర్లించకు కపిరాజ కవీ !

నీవు ఇంద్రుడవో చంద్రుడవో
మాకక్కరలేదు
నీ ఇంద్రజాల మహేంద్ర జాలాలూ
మాకక్కరలేదు

నిఘంటువుల్ని కావ్యాలనుకొని
నీవు కవిని అనుకోకు
కరంటును కాంతి అనుకొని
నీవు రవిని అనుకోకు.

నవరసాల నందన బృందావనాలకు
మా నవనవోన్మేష శుక పికాలను
చేరుస్తావని వస్తే, చేరుస్తున్నావా
క్షయరోగ శాలలకు, శల్య వైద్యశాలలకు!

సమాస రజ్జువులతో
చొప్పదంటు కవిత్వపు మోపులు గట్టి
సహృదయతా సహనాల వీపుల మీద
మోపు మీద మోపు పెట్టబోకు
చాటుగా సాంప్రదాయ బద్ధంగా కాక
ఘాటుగా బల్లెపు పోటులా
సత్యం చెప్పినందుకు తిట్టబోకు.

(1967)

# ఆధునికాసురుడు

ఆధునికాసురుడు
ఆరితేరిన బకాసురుడు
ఎలాఉంటాడో ఎక్కడుంటాడో
ఎరిగించరాని కామ రూపుడు -

మరుగుజ్జులాగుండొచ్చు
మనిషికి మాటకూ బెదరని
మ్రానులాగుండొచ్చు
నడి వీధిలో ఉండొచ్చు వాడు
నట్టడివిలో ఉండొచ్చు
వేషం ఎద్దైన కావచ్చు
భాష ఏద్దైనా మాట్లాడవచ్చు -

నెత్తిమీద వాడికి కళ్ళుంటాయి
నేరుగా చూడాలేనంటాయి
ఒంటినిండా వాడికి పళ్ళుంటాయి
ఒంటిగా చిక్కినవాణ్ని కొరుక్కు తింటాయి -

పాదరసంలాగ తిరుగుతాడు
పాప పంకిలం పూసుకొని,
కొమ్మలెక్కి పాడుతాడు
కోకిల వేషం వేసుకొని -

సొంతలాభం కొంతైన ఉంటేనేగాని
గొంతెంత్తడు, గోరంతైనాశ్రమపడడు
దేశమంటే వానికి వట్టి మట్టి
మనుషులంటే మట్టిపురుగులు, మశకాలు -

వాడిమాట బెల్లంలా తీపి
వాడి బాట నాగుబాముకు కాపీ
వాడు కులుకుతాడు మిత్రులనెడబాపి
వాడు వేస్తాడు గాంధీజీకే టోపీ -

సంగీతానికి రాలని చింతకాయవాడు
నాగస్వరానికి చిక్కని నాగుపాముకాడు
చెప్పిందానికల్లా అంటాడు జీహుజూర్, చిత్తం !
చేసేవన్నీ పొందడానికి అధికారం, విత్తం !
మాటాడుతాడు ముద్దుగా
వెన్నులో పొడిచేసేదాక
ఆటాడుతాడు అద్భుతంగా
మెడలో కాటేసేదాక -

నీడలాగ వాణ్ని పట్టుకోవడం కష్టం
చిచ్చులాగ వాణ్ని తట్టుకోవడం కష్టం
అయితే వాడు మనల్ని వేటాడుతున్నది స్పష్టం
ఆధునికాసురుణ్ని
ఎలా జయిస్తారో మీ ఇష్టం !

(1968)

# విదేశయాత్రలో స్వదేశస్పందనం

వినోదయాత్ర, విజ్ఞానయాత్ర
శాంతియాత్ర, సమరయాత్ర
స్వదేశయాత్ర, విదేశయాత్ర
తీర్థయాత్ర, రోదసీయాత్ర
అన్నియాత్రలకు కేంద్రం
జీవితయాత్ర
అన్ని యాత్రలకు ఆదర్శం అనుభూతి
అందుకే
అనుభూతుల్ని పెంచుకోవటం
అనుభూతుల్ని పంచుకోవటం
నాజీవితానికి ఆశయం –
నా తొలి విదేశ యాత్రలో
కలిగిన అనుభూతుల్ని కొన్ని
వెలిగిన దేశీయ స్పందల్ని
ఆవిష్కరిస్తున్నాను ఆత్మానందం కోసం –

## ఏథెన్సులో అరుణోదయం

సోక్రటీస్, ప్లేటో, అరిస్టాటిల్
ఉదయించిన ఉజ్వలగ్రీకుదేశం మీదుగా
మధ్యధరా సముద్రతీరాన నాడు
విద్యా పీఠమై వెలసిన ఏథెన్సు మీదగా
ఎగసిపోయింది మా విమానం
జలద జలజ చుంబనాసక్త బంభరంలా
ఉదితారుణ కిరణపుంజంలో నుంచి
నిదురలేచిపోయే కపోత పోతంలా

ప్రశాంతమైన కొండలోయల కావల
విశ్వంభర అపుడే మేల్కొని
విశాలసాగర వినీల తరంగాలలో
ముఖప్రక్షాళనం చేసుకొని
రమ్య సానువుల వితర్దికపై కూర్చుని
రాగారుణ మందస్మితవదనయై
నుదుటిపై కుంకుమబొట్టుపెట్టుకొని
ప్రాగ్దిశాకాశ ముకురంలో
పారజూచుకున్నట్లనిపించింది
అక్షరాల కందని అందంతో
సూర్యబింబం ఉదయించింది
గుండె కెమెరావిప్పి
ఊహల స్విచ్ నొక్కి
ఆ దృశ్యాలను ఫోటో తీసుకున్నాను-

పోటీపడి పోరాటాలు సల్పి
పురాతన చరిత్ర పుటల్ని
నరరక్తంతో తడిపిన నగరయుగళం
రోం-ఏథెన్సు-

అలగ్జాండర్ భారతదేశానికి వచ్చి
ఇరవై మూడు శతాబ్దాలైంది
బుద్ధుడు, కన్ఫ్యూషియస్, సోక్రటీస్
పుట్టి అప్పటికే రెండు శతాబ్దాలైంది
అయితే నేమిటి నేను
అక్కడి అమరశిల్పాలను స్పర్శిస్తున్నప్పుడు
గ్రీకు నాగరికతా సోపానంమీద
నడుస్తున్నప్పుడు
పరిక్లియన్ యుగపు ఆక్రోపాలిస్ పైని
పార్థెనాన్‌లో పరవశిస్తున్నప్పుడు

హోమర్-వాల్మీకి
బుద్ధుడు-సోక్రటీస్
అలగ్జాండర్-పురుషోత్తముడు
అరిస్టాటిల్-చాణుక్యుడు
ఆరని దీపాలై నాలో
తీరని సంచలనం లేపారు
పిండార్ కవివలె నేనూ ఏథెన్సుపై
కవితా గంధాలు వెదజల్లాను-

శిల్పకళానై పుణ్యం-చిత్రకళా సౌభాగ్యం
వాస్తు శిల్పరచనాశక్తి-సుందరభావకల్పనాసక్తి
పలకరించే పురాతన ఏథెన్సులో
పులకరించాను అధునాతన మనస్సుతో -

## కాలకెళీరంగం రోం నగరం

ధరాతల చరిత్రలో
పురాణేతి హాసాల్లో
భారతదేశానికి సరివచ్చే
వీరభూమి ఇటలీదేశం
చరిత్రకు జీవం పోసిన సంఘటనలకు
నిశ్చల సాక్షి ఆనేల
ఘోరసమరాలు, సామ్రాజ్యాలు
ఘూర్ణిల్లిన కల్లోలిని
వేసవేల వసంతాలు
జీర్ణించిన సంస్కృతీవని
మధ్యధరా సాగరం
రోం మహా నగరం-

రోం నగర చరిత్రా స్మృతి
రోమాంచం కల్గిస్తుంది
ప్రతి శిథిల శిల్ప సౌందర్యరేఖ

ఎదో మహాకావ్యం వినిపిస్తుంది
కాలసర్పం కాటువేసిన
కాన్స్ టంటీన్ ఆర్చి
కలోసియం
కాసల్ ఆఫ్ సేంట్ ఎంజిల్
శతాబ్దాల చరిత్రామందిరంలో
ఒరిగిపడ్డా చెరిగిపోని స్తంభాలు-
పాంథియాన్
కాలప్రళయగర్జలకు
బెదరని జీవరసానందనిలయం-
విలయవలయంలో చిక్కుపడ్డ కళాలయం
మసోలియం-

మానవసేవాసక్తి, భగవద్భక్తి
మహానదులై
తమ ఉత్తుంగతరంగ హస్తాలెత్తి
అమరలోక కవాటాలు విప్పి
భక్తకోటికి ముక్తి సందేశం
ఇస్తున్నట్లనిపించింది
ప్రార్థనా గీతాలతో ప్రతిధ్వనించే
అక్కడి బ్రహ్మాండమైన
సేంట్ పీటర్ చర్చిగోపురాలు;
సాటిలేని మేటి వాటికన్
భువన మోహన భవన కూటం
క్యాథలిక్ మతపీఠం
పోప్‌పాల్ దివ్య కిరీటం
రోం నగర విశాల శతపత్రానికి
కోశంలా కనిపించింది-

రోడసీయాత్రికునికి ధరిత్రిలాగ
రోంనగర యాత్రికునికి చరిత్ర
కాలపు మైదానంలో జాలిగా పడిఉన్న
బంతిలా భాసిస్తుంది -

"ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని
ఈ మధ్యే మన తెలుగుభాషకు పేరు పెట్టారు
వాళ్లు ఒప్పుకున్నా లేకున్నా
భాషా పరంగా వాళ్లతో
మనకు సంబంధం అంట గట్టారు ;
ఎవడో బయటివాడు మెచ్చుకుంటే తప్ప
ఎందుకూ కొరగాని వాళ్లం మనం
ఎంతటి గొప్పవాడైనా సరే
గుర్తించము మనవాళ్లని మనం
ఏదో బింబానికి ప్రతి బింబం
అనుకోవడమే మనకు ఘనం
ఇంతకీ
ఇటాలియన్లకు తెలుగు భాషంటే
ఏమిటో తెలియదంటే మనం వినం !

## భూలోక సుందరి స్విట్జర్‌లాండ్

ఐరోపా హృదయంలో ఆటలాడే
రైనునది జన్మించిన ఆల్ప్సుకొండలు
జలకమాడే మేటి కొలనులు
అందాలు ఆరబోసిన
సుందర భూమి స్విట్జర్‌లాండ్
జెనీవా పట్టణం చుట్టూ
జీవకళా సౌందర్యాలు పరచి
తలుపూ తాళంలేని తన ఇంటికి ఎవరు వచ్చినా

చిరునవ్వుతో అహ్వానించే
సేదతీర్చి ఆనందాన్ని పంచే
విచిత్ర వినోదిని
స్విట్జర్‌లాండ్ విలాసిని -
ఒకరిగుట్టు ఒకరికి చెప్పకుండా
ఆడినమాట తప్పకుండా
దొంగలనూ దొరలనూ
ఆదుకొనే జగదంబ
అవనీతల స్వర్గరంభ -
మానవుల కామె ఇచ్చే గడియారాలు
మరవురాని మణి కంకణాలు
భిన్న భిన్న సంస్కృతులు కలవారైనా
సహజీవన సౌఖ్య జీవితాలు గడపవచ్చని
ఆమె ఇచ్చే వాస్తవిక ప్రేమ సందేశాలు
అంతర్జాతీయతకు అజేయశిఖరాలు.

## కన్నీటిలో వాటర్‌లూ

1815లో జరిగిన
పెద్ద యుద్ధం ఏది అనగానే
శుద్ధ మొద్దైనా చెపుతాడు
"వాటర్‌లూ" అని
వాటర్‌లూ అనగానే
నాటి రాజకీయాలు
సాంఘిక పరిణామాలు
సామ్రాజ్య స్థాపనకోసం
జరిగిన మహారణాలు
సహజంగా జ్ఞాపకం వస్తాయి -

లంకలో జరిగిన రామ రావణ యుద్ధానికి
కురుక్షేత్రంలో జరిగిన కౌరవ పాండవ యుద్ధానికి
వారసుల్లో వాటర్‌లూ ఒకటి
నెపోలియన్ ఓడిపోయిన
ఆ అపార ఘోర యుద్ధాన్ని
ఉన్నదున్నట్లుగా చిత్రించిన
ఊహాతీత కుడ్య చిత్ర గోళాన్ని
చూచినా నమ్మజాలని సుందర కళానిలయాన్ని
ఈ జన్మలో చూడలేకపోతే
ఇంకో జన్మలోనైనా చూడాలి –

అయ్యో! ఆ గుర్రం పడిపోయిందక్కడ
అబ్బా ఎందరు కూలిపోతున్నారిక్కడ
ఎటు చూచినా వికట హాసం
ఎందుకో అంత ద్వేషం రోషం!
రుధిర పాతంలో మండిపోతున్న నేల
క్రుంగిపోతున్న నింగి–చిత్రం
బాకులూ బల్లాలు
ఫిరంగులూ సురంగలూ
కోలాహలం హాలాహలం
మహోద్దండ ఖండన పండితుడౌ
వెల్లింగ్టన్ కళ్లల్లో పౌరుష జ్వాలలు
సింహబలుడు మార్షల్ బూషర్
చేస్తున్న విలయతాండవం
విజృంభించిన యోధానుయోధుల
శత్రువ్యూహాలను ఛేదించిన శూరులు
వీరవిహారాలు – వికట హాసాలు
ఎలా చిత్రించారో
ఎన్ని రంగుల్లో – ఎంతకన్నీటిలో
కుంచెలు ముంచారో!

# ధర్మవేణి జర్మనీ

ధర్మాన్ని ఒకప్పుడు ఉరితీసిన
జర్మనీ దేశాన్ని
ఖండఖండాలను జయించనెంచి
రెండు ఘండాలైనదేశాన్ని
రైను నదీ నీరపాన మత్తను
మానవతా రక్త సిక్త చిత్తను
ఎలా వర్ణించాలో తెలియదు
అలా అంటే మీరూరుకోరనితెలును-
జర్మనీ పేరెత్తగానే
రెండు ప్రపంచ సంగ్రామాలు
హిట్లర్ ముసోలీనీలు
జ్ఞాపకం వస్తారు-సహజం
"రావణుడు లంకలో సీతను చెరబట్టినట్లు
హిట్లర్ జర్మనీలో నీతిని చెరబట్టాడు
అయితే
సీత మానం వీడలేదు
నీతి ప్రాణం వీడలేరు"
మిత్రులు మీరాఖాన్ దంపతులతో
కర్మాగారాల జర్మనీలో ప్రవేశిస్తున్నప్పుడు
ఛలోక్తిగా అన్న ఈ మాటలు
శిలాక్షరాలు నిజానికీ -

జర్మన్ శ్రమకు మారుపేరు
జర్మనీ పరిశ్రమకు మరోపేరు
వేదమంత్రాలు పఠించి
భారీయంత్రాలు తయారుచేసి

యోగమార్గాలు గ్రహించి
ప్రయోగ మార్గాలు వేసి
ఆత్మజ్ఞానం నుండి
పదార్థ జ్ఞానాన్ని పిండి
అణుయుగాన్ని-అంతరిక్షయుగాన్ని
ఆవిష్కరించిన
అజ్ఞాత విజ్ఞాన శాస్త్రజ్ఞుల ఆలయం ఆనేల
అమృతం వెంట హాలాహలం
ఆవిర్భవించిన సాగరడోల -

చక్కని పంటచేలు-చిక్కని పాడి ఆలు
లేమిఎరుగని పల్లెటూళ్లు-శ్రీలుతరగని పట్టణాలు
రైనునదీ రాగదృగంచలాలలో
కొండలోయల నిండుగుండెలలో
వర్ధిల్లే వింతదేశం అది -
నిర్మూలన పాథాన్నివదలి
నిర్మాణ పథాల భావి రథాల కదలి
చేతనా కేతనాలు ఎగరవేసే
ధర్మవేణి జర్మనీ నేడు-

సువిశాల విపణ వీథులనిండా
వివిధ రకాల సరకులను నించి
దిగుమతులకన్న ఎగుమతుల్ని ఎన్నోరెట్లు పెంచి
కష్టించే ప్రజలకెన్నడూ నష్టం ఉండదు
దేశభక్తి దీపించిన జాతికి దేనికీ లోపం ఉండదు
అని అక్షరాల నిరూపించింది-
బాన్, కలోన్, బర్లిన్
ఫ్రాంక్ ఫర్టు, హ్యాంబర్గు
పంచమహానగరాలు
జర్మనీ చైతన్యాభరణాలు

ఉత్పత్తికి ప్రతి ప్రతిపత్తికి
ఉదయకిరణ తోరణాలు -
కలోన్ చెక్కి మహోన్నతగోపురాలు
చక్కటి సముప్రతీరాలు- లెక్కలేననిన్ని పురాలు
హాంబర్గు నైటు క్లబ్బుల పచ్చి శృంగారాలు
"రూర్" లోని ప్రతీభోద్దీప్త కర్మాగారాలు
ఎటుచూచినా వింతలూ విశేషాలు
భిన్నభిన్న రాగాలు-జర్మనీ జీవిత ప్రకరణాలు
విప్పడానికి శక్యంకాదు.

## లండన్ దీపం

కొండల్లాంటి
రాకాసి గుండెల్లాంటి
బకాసురుని కండల్లాంటి సౌధాలతో నిండిన
లండన్ మహానగరాన్ని నేను
క్రిస్‌మస్ పండుగనాడు చూశాను
అక్కడివాడలూ-వాడలలోని మేడలూ
మేడల చుట్టున్న గోడలూ
అన్నీ జ్ఞాపకం చేశాయి కన్నీటి గాధల్ని
భారతమాత బందీగాపడ్డ బహువిధాల బాధల్ని -

ట్రఫాల్గర్ స్క్వేర్‌లో నిల్చుని
నెల్సన్ కాలంను నిటారుగా చూస్తూ
నెమరు వేశాను చరిత్రను
వెస్ట్‌మినిస్టర్ అబె పరిసరాల ఆగుతూ
థేమ్సునది ఒడ్డున సాగుతూ
అస్తమించదనుకున్న సూర్యుడు
ఉదయించడమేలేదని నవ్వుకున్నాను
నన్ను చూచి థేమ్సునదీ నవ్వుకుంది
సాభిప్రాయంగా నిట్టూరుస్తూ
సాగరంవైపు సాగిపోయింది-

బకింక్‌హాం భవనం ముందర
పాతవాసన కొంత కనిపించింది

నూతిలో పడిపోయిన సింగపు
చేతగాని గొంతు వినిపించింది
"పరాన్నభుక్కు మరేది దిక్కు
తీరని చిక్కు దేవునికి మొక్కు"
గొణుకుతూ నాగుండె ఎదో
గొబ్బిళ్ల పాడుకుంది
"గుండ్లు బెండ్లాయె బెండ్లు గుండ్లాయె"
ఎదో సామెతను వాడుకుంది
పోస్టల్ టవర్ మీదనుంచి
స్పష్టంగా చూశాను
విశాల సువిశాల ప్రశాంత నగరాన్ని
శైశిర సర్వదష్ట వసంత సౌందర్యాన్ని-

బ్రిటిష్ మ్యూజియం
చరిత్రను వడబోసితీసి సారం
రాలిపోయిన పద్మాలు తేలుతున్న కాసారం
మార్క్సు మహాశయుడు
మహాసామ్రాజ్యాలకు
చరమగీతం వ్రాసిన సంధ్యాచల శిఖరం అది-

ఖండఖండాలనుంచి తెచ్చిన అఖండ కళాఖండాలు
దేశదేశాలనుంచి వచ్చిన శిథిలనాగరికతా భాండాలు
చరిత్ర మహావృక్షం విరిసిన పరిణామగంధాలు
ధరిత్రికన్న మహామహులు విరచించిన విజ్ఞాన గ్రంథాలు
అన్నీ భద్రంగాకూర్చిన
ఆధునిక మయసభఅది
దురహంకారదుర్యోధనులకు
బుద్ధినేర్పే విద్యాలయం అది-

షేక్స్పియర్, మిల్టన్, జాన్సన్
వర్డ్స్వర్త్, బైరన్, షెల్లీ
కీట్సు, టెన్నిసన్, బర్నాడ్షావంటి
సాహితీ స్రష్టలు
తత్వచింతనా సాగరులు
వెలసిన ఇంగ్లండు ద్వీపం
చరిత్రలో ఆరని దీపం (1968)

# అంతరిక్ష పర్వం

పందొమ్మిది వందల అరవై తొమ్మిది
జూలై ఇరువై ఒక్కటినాడు
ప్రాణికోటి చరిత్రలో
ప్రప్రథమంగా మానవుడు
పాదం మోపినాడు
చంద్రలోకం మీద -

విజ్ఞాన కవచధారి
విశ్వంభర రాయబారి
సృష్టి రహస్యాల మీద
మరొక్క
చీకటి తెర తొలగించాడు.
అనంత తారా పథంలో
ఆరని దీపం వెలిగించాడు -

'కేపు కెనడీ'లో
మానవత కేతెత్తి
నవశకాన్ని పిలిచింది
అపూర్వ అంతరిక్ష యాత్రలో
అందరాని అందాల చందమామను
ఆది సోపానంగా మలచింది.

లూనిక్-జెమినీ
లూనా-అపోలో
రోదసీ విజయ కేతనాలు
రష్యన్-అమెరికన్
రాజూ-పేదా
నవ మానవునికి సంకేతాలు

వేలవేల శతాబ్దాలకన్నా
గత వేయి వత్సరాలలో
గత వేయి వత్సరాలకన్న
గత శతాబ్ది కాలంలో
గత శతాబ్ది కాలం కన్న
గత దాశాబ్ది కాలంలో
గత దశాబ్ది కాలంకన్న
గత సంవత్సర కాలంలో
గత సంవత్సర కాలంకన్న
ఈ ఒక్కనాడు
జూలై ఇరువై ఒక్కటి నాడు
పరిణామ చరిత్రలో నరుడు మిన్నగా
ప్రగతిని సాధించాడు.

బాహు బలుడు-సాహసుడు
బుద్ధి బలుడు-మానవుడు
చంద్రలోకం చేరగానే
చెప్పాడొక గొప్పమాట
"మనిషిగా నే వేస్తున్న ఈ ఒక అడుగు
మానవతకు యుగ యుగాల పొడుగు" -

లోకం మీది కోటి కోటి
లోచనాలలో-ఆలోచనలలో
సంతోష మృదంగాలు
సందేహ తరంగాలు
మ్రోగాయి-రేగాయి.

గాలిలో తేలడమే
ఘనతనుకున్న రోజులు వెళ్ళి పోయాయి

గో ప్రదక్షిణ లాగ
భూ ప్రదక్షిణ చేయగల్గిన
కాలం కూడా వచ్చి ఎంతో కాలం అయిపోయింది -

ఒక గ్రహంనుంచి మరొక గ్రహానికి
ఒక లోకంనుంచి మరో లోకానికి
స్వప్నంలో కూడా సాధ్యం కాని
సంచారం సాగిస్తున్నాడు
ఆది అంతంలేని దేశ కాలాల
అంతు కనుక్కుంటున్నాడు
మానవుడు నేడు.

అయితే,
మానవుని ఈ అద్భుత విజయాలన్నిటికీ
ఏమిటి పర్యవసానం ?
మానవ లోకాన్ని ఎక్కడికి చేరుస్తున్నట్లు
ఈ అపూర్వ ప్రస్థానం !

అణువు డొక్కను చీల్చింది
అంతరిక్షాన్ని గెల్చింది
నవయుగాన్ని పిల్చింది
ఎందుకో తెలుసా మానవునికి ?
ఎప్పుడూ తనలో ఉండే దానవునికి ?

అగ్గిపుల్ల కన్నా
అణుబాంబు గొప్ప కాదు
అంటించడానికి అవనీగోళాన్ని -
రోడ్డు ప్రయాణంకన్నా
రోదసీ యాత్ర గొప్పకాదు
చేరడానికి మారణ రణరంగాన్ని -

కాకి అరుపులన్నా
కమ్యూనికేషన్ సాటిలైట్లు మిన్న కాదు
ప్రసారం చేయడానికి ద్వేషాన్ని -

కరువు కాటకాలు చూపడానికి
కెమేరాలు, టెలివిజన్లు అక్కరలేదు
ఆర్త నాదాలు వినిపించడానికి
ఆకాశవాణి అక్కరలేదు !

శక్తిని సంపాదించుకోవటం
యుక్తిని పెంచుకోవటం
చెడును నిర్మూలించటానికైతే
మంచిదే - కావాలి
మంచిని మంటగలపడానికైతే
చెడ్డది - పోవాలి

తన కుటుంబంకోసం తన ఊరును
తన ఊరుకోసం తన రాష్ట్రాన్ని
తన రాష్ట్రం కోసం తన దేశాన్ని
తన దేశం కోసం తక్కిన దేశాల్ని
దోచుకునే వాడు
నానా వాదాలతో
నవీన నినాదాలతో
స్వార్థాన్ని సత్యంగా
సమరాన్ని శాంతిగా
నిరూపించ యత్నంచేసే మానవుని
ఆశయాల మీద నమ్మకం
అందరికీ సడలి పోతున్నది
తనలోకం ఘనత కోసం
తక్కిన లోకాల శాంతిని
భగ్నం చేస్తాడేమో అను సందేహం
భావుకులకు కలుగుతున్నది-

చేతులు జనరక్తంలో తడిపి
కాళ్ళు చంద్రలోకం మీద పెడితే
అస్పృశ్య గ్రహాలను స్పృశించి
అస్పృశ్యులను అనాథులను బహిష్కరిస్తే
చర్విత చర్వణమే అవుతుంది
మానవ చరిత్ర
చంద్రలోకమైనా
ఇంద్రలోకమైనా
చెడిపోతుంది
స్వార్థాల చెరల్లో
సంకుచితాల ఉరుల్లో
చిక్కి నలిగిపోతుంది-

అతర్ముఖులైన మనీషులు
అనవరతం తపస్సు చేసి
సాధించారు ఆత్మ జ్ఞానం
వేదాలలో విశ్వరహస్యాలు
యోగాలలో జీవరహస్యాలు
నిగూఢంగా సంధించారు-

బహిర్ముఖులైన శాస్త్రజ్ఞులు
బహుళ ప్రయోగాలు చేసి
సాధించారు పదార్థ జ్ఞానం
విడదీశారు విశ్వ రహస్యాలు
నిరూపించారు నిగూఢ సత్యాలు-

యోగమార్గంలో ఆత్మజ్ఞానం
ప్రయోగ మార్గంలో పదార్థ జ్ఞానం
ప్రాక్పశ్చిమంగా పయనించి
పరిణామ ద్వంద్వ ప్రకృతిగా రూపించి

ఒకటి నొకటి ఎదురుగా వచ్చి కలిశాయి
ఒకరిలో ఒకర్ని చూసుకొను మురిశాయి -

అణువు ఆత్మైతే
పరమాణువు పరమాత్మవుతుంది
అణువు లేక పదార్థంలేదు
ఆత్మలేక జీవుడులేడు
అణుశక్తితో సాధించేది
అందుకే
ఆత్మశక్తితో సాధించవచ్చు
పరమాణువును వశం చేసుకుంటే
పరమాత్మ వశం కావచ్చు-

రావణుడు సాధించిన యోగసంపదను
రాక్షసత్వం మంట కలిపింది
తపోబలం కపోతాలను చంపడానికి
ఉపయోగించడం వల్ల నశించింది-
మరోలా చెప్పాలంటే
సీతను చెరబట్టిన రావణుని
చదువులూ సాహసాలూ వ్యర్థమైనవి
శాంతిని చెరబట్టే మానవుని
శాస్త్ర విజ్ఞానం అలాగే అవుతుంది-

అమృతం దొరికిన్నాడు
అసురులు తమకే కావాలన్నారు
అంతులేని హింసాకాండ జరపడానికి
సురల్ని త్రుంచి తమ పతాక నిలపడానికి
సాటిలేని నేటి విజ్ఞానామృతం కూడ
సమరోన్మాదులు
స్వార్థపరాంధులు

చేజిక్కించు కోకుండా
చేయవలసిన బాధ్యత
శాంతి కాముల
క్రాంతి గాముల
భుజస్కందాలపై ఉంది
చైతన్య స్యందనాలపై ఉంది-

దురుప యోగం చేసి
ఆత్మజ్ఞానాన్ని
దూరం చేసుకున్నాం
సదుపయోగం చేసి
పదార్థ జ్ఞానాన్నైనా
దక్కించుకుందాం-

స్వార్థంతో సంబంధాలు త్రెంచుకుని
సకల గ్రహాలతో బాంధవ్యం పెంచుకొని
సృష్టి సర్వాన్ని ఒకే
శాశ్వతానంద సూత్రంలో సంధిద్దాం-
నరకలోకమై పోతున్న
నరలోకాన్ని
నవీన పర్వంగా మలుద్దాం-

(1969)

# సంతానశాస్త్రం

"పరిమితంగా పెరుగుతుంది
ఆహారోత్పత్తి
అపరిమితంగా పెరుగుతుంది
సంతానోత్పత్తి
ఉభయోత్పత్తుల నిష్పత్తుల
వ్యత్యాసంలో
ఉత్పన్నమౌతాయి
కరువు కాటకాలు
ఈతి బాధా కీటకాలు
అవి అదనపు జనాన్ని తినివేసి
అదుపులో పెడతాయి జనాభాని"
మూడు ముక్కల్లో చెప్పాలంటే
థామస్ మాల్థస్ జనాభా సిద్ధాంతపు
సారాంశము ఇది —

నాటికీ, నేటికీ, ఏ నాటికీ
బూటకం కాని మాట ఓటుంది—
జనాభాను పెంచగల్గినంత వడిగా
జీవన సాధనాలు పెంచలేం
ప్రశ్నలు వేయగల్గినంత సులువుగా
సమాధానాలు అందించలేం
అందుకే
సాధన సంపత్తి లేని సంతానం
సమాధానాలు లేని పశ్నలు !

అయిదుగురికే చోటున్న గదిలో
పదిమందిని పడవేస్తే
బాధ పడేది ఏ ఐదుగురో కాదు

ఆ పదిమందీ;
బయటికి రాలేక
లోపల ఉండలేక
గడియ వేసిన ఆ గదిలో
ఉకికి ఉకికి చస్తారు గదా
ఉన్న ఆ పదిమందీ
కలకత్తా బ్లాక్ హోల్ ఖైదీల్లా" -

"పుట్టెడంత సంతానాన్ని కనేయ్
పుట్టిన వాడి పోషణ దేవుడికి వదిలేయ్"
అన్నది సనాతనాచార ఖర్మం !
"పోషణకై చక్కని ఏర్పాట్లు
ఎంతమంది కున్నాయో చూసుకో
అంతకు మించి సంతానం కలుగకుండా చేసుకో"
అన్నది నేటి సంతాన శాస్త్ర ధర్మం !

మనుష్యులు పుట్టేది
మరణించడానికే కాదు
పూర్వ జన్మలో చేసిన కర్మలకు
పూర్తిగా శిక్ష అనుభవించడానికీ కాదు;
జీవితం ఆనందానుభూతి కోసం
కష్టాలకు కన్నీళ్లకు
కానుకలుగా పుట్టడం దోషం -

ఆనందం-వివేక బ్రహ్మ దయా దత్తం
యాతన-అవివేక క్రియా కల్పితం
అనురాగ గీతికి ఆనందానుభూతికి
సుందరతకు సుభానికీ
నోచుకోలేని బ్రతుకు బ్రతుకు కాదు
వాటిని అందించలేని

అరణ్య సంతానాన్ని కనే
అధికారం మనకు లేదు -

సంతానాన్ని నిరోధించడం అంటే
సౌభాగ్యాన్ని పెంచటం
కుటుంబ నియంత్రణం అంటే
మానవ కుటుంబానికి
అమృతం పంచటం -

ప్రతి సెకండుకు
ముప్పయి మంది పుడుతున్నారు
మనదేశంలో నేడు !
ఫలిత మేమి టంటావా
కూడు, గూడు, గుడ్డలు లేని
కోట్ల కొలది జనాభాని చూడు !

కష్టపడ్డా బ్రతుకలేని వాళ్ళను
ముష్టి అడుక్కునే వాళ్ళను
కన్నీళ్ళతో కడుపు నింపుకొనే వాళ్ళను
కన్నవాళ్ళెవరైనా పాపిష్టులే
అలా కన వద్దని నేను
పెడుతున్న ఈ గోలంతా
కవిత్వమైనా కాకపోయినా
కఠినమైన సత్యమే-

ప్రణాళికల గురించి ఏది చెప్పినా
ప్రచారం లాగే ఉంటుంది
మంచి గురించి
ఎలా బోధించినా
మత ప్రచారం లాగే ఉంటుంది.

చాటుగా చెప్పినా సూటుగా చెప్పినా
సత్యం సత్యమే అవుతుంది
సత్యానికి
కుటుంబ నియంత్రణ
సంతాన శాస్త్రమే అవుతుంది -

సూక్ష్మమైన ధర్మాల్ని
సూత్రాలుగా మలచి నట్లు
శాస్త్రాలలో వ్యంజించిన
సంతాన నిరోధక ధర్మాన్ని
శాస్త్రంగా మలుస్తున్నాను-

ఇంటింటికీ
జంట జంటకీ వర్తించే
ఈ సంతాన శాస్త్రం
ప్రబోధించే కుటుంబ నియంత్రణ
ఎవరికి వారికి వ్యక్తిగత విషయమే అయినా
ఇవ్వాళ దేశానికి ఆదర్శం అయింది,
అన్ని సమస్యల పరిష్కారానికి
అందరి ఆనందాల ఆవిష్కరణానికి
ఆయువు పట్టయింది -

"గంగి గోవుపాలు గరిటెడైనను చాలు
కడివెడైననేమి ఖరము పాలు"
అన్న వేమన్న ధర్మనాదం నుంచే
"బ్రతికి పేరుకొచ్చే వాళ్ళిద్దరిని కంటే చాలు
బ్రతుక లేక పడి చచ్చే వాళ్ళెందుకు వేన వేలు" అనే
నేటి సంతాన శాస్త్రపు నాదం ఉద్భవించింది.
"ఇద్దరు లేక ముగ్గురు పిల్లలు చాలు"
అని దశ దిశలా ఘోషించింది -

ఈ లోకమనే రైలు బండిలోనికి
ఎక్కే ప్రతి ప్రయాణికుడు
సుఖంగా ప్రయాణం చేసి
చూడదగ్గ చోట్లన్నీ చూసి
తృప్తిగా వెళ్ళి పోవడం
క్లుప్తంగా సంతాన శాస్త్రహితం -

మన వలన మరో జీవుడు
జన్మించ లేక పోతే లేదు ముప్పు
పుట్టిన వాళ్ళని
సుఖంగా అభ్యుదయోన్ముఖంగా
పోషించలేక పోవడం క్షమించరాని తప్పు -

సర్వే జనాస్సుఖినో భవంతు
అన్న ఆశయాన్నే
సవివరంగా సరసంగా
సంతాన శాస్త్రంగా
నే చెప్పటం
తప్పంటావా ? చెప్పు -

(1969)

# ఎన్ని కలలో ఎన్ని కలలో?

ఎన్ని కలలో ఎన్ని కలలో ?
ఒక్క చేపకై ఎన్ని వలలో
ఓటర్ల మహాసముద్రంలో
ఎన్ని అధర్మాలఅలలో
ఎన్ని ఆవేశాల సుడిగుండాలో
ఎన్ని ఆగ్రహాల తిమింగిలాలో
ఎన్ని అభ్యర్థుల పడవ మునకలో ! –

రాజకీయ స్వయంవరంలో
అధికార సీతా పాణి గ్రహణంలో
ఏవేవి శివధనుస్సులో
ఎవరెవరు శ్రీరామ చంద్రులో
ఎవరు విశ్వామిత్రులో
ఎవరు పరశురాములో
ఎన్ని పాదుకా పట్టాభిషేకాలో
ఎన్ని కీకారణ్య వాసాలో!

ప్రజాస్వామ్య క్షీర సాగర మథనంలో
ఎవరు కూర్మాలో ఎవరు వాసుకులో
ఎవరు దేవతలో ఎవరు రాక్షసులో
తేలేదెవరో అదృష్టామృతంలో
కూలేదెవరో కోలాహల హాలాహలంలో

సిద్ధాంతాల రోదసీ యాత్రలో
ఎన్ని గ్రహాలో ఎన్ని ఉపగ్రహాలో
ఎన్ని చంద్రమండల విజయాలో
ఎన్ని "అపోలో పదమూడు" అపజయాలో

ఎన్ని కల కలలలో
ఎన్ని మరీచికలో
ఎన్ని యాదార్థ వీచికలో

(1971)

# భరతమాత గర్విస్తున్నది

భరతమాత గర్విస్తున్నది
భరతజాతి గర్విస్తున్నది
ప్రాగ్దిశా ప్రాంగణంలో
దాస్య శృంఖలాల బద్ధమైన
స్వాతంత్ర్య లక్ష్మిని విముక్తి చేసినందుకు
భరతమాత గర్విస్తున్నది
భరతజాతి గర్విస్తున్నది.

మన మానవతా తత్వానికి
మనసేనల అద్భుత పౌరుష పటుత్వానికి
మన జాతిని నడిపించే
మహోజ్వాల స్వాతంత్ర్య ప్రియత్వానికి
మానవలోకం జోహారులర్పిస్తున్నది
మన నాగరికతా సంస్కృతీ పరిమళాలను
ఆఘ్రాణించి పరవశిస్తున్నది;
భరతమాత గర్విస్తున్నది–భరత జాతి గర్విస్తున్నది

మతోన్మాద సమరోన్మాదులు
నిరంకుశత్వ నియంతృత్వవాదులు
మనదేశపు పవిత్ర సరిహద్దులు ముట్టలేరని
మన శత్రువులు మన నేలపై కాలుపెట్టలేరని
మళ్లీ ఒకసారి దిగ్దిగంతాకు చాటిన
మన రక్షా దీక్షా శంఖారావం
సమైక్య సంఘటిత భారత శక్తికి
చరిత్రాత్మక విజయ ధ్వజాన్ని ఆవిష్కరిస్తున్నది
భరతమాత గర్విస్తున్నది

ఆయుధబలాలు సాయుధ బలాలు
ఆత్మ బలాన్ని జయించలేవు
క్రొవెక్కిన కారుమబ్బు దండులు
కొండ శిఖరాలను కూల్చలేవు
సత్యాన్ని శాంతిని స్వాతంత్ర్యాన్ని
మాయాపులు చెరచలేరు
ఈ వాస్తవం, లోకం కప్పుకొన్న
అవాస్తవాన్ని చీలుస్తున్నది
అంధకార సింధు మథనంలో
కాంతి అమృతం ఆవిర్భవిస్తున్నది
క్రాంతీందిర సాక్షాత్కరిస్తున్నది
భరతమాత గర్విస్తున్నది-

మానవ చరిత్రలో కానరాని
మారణ హోమాన్ని ఆక్సగలిగినందుకు
పశుత్వం పంజా విప్పి మీద పడుతుంటే
ప్రాణభిక్ష మానభిక్షకోసం
మన ముంగిటిలో చేరన
లక్షలాది శరణార్థులకు
రక్షణ కల్పించ గల్గినందులకు
భరతమాత మరొక సారి పునీతమైంది
ప్రతి భారతీయుని శిరస్సు హిమాలయ శిఖరమైంది
మన నింగీ, మననేల, మన మహా సాగరం
మన ధర్మవీర విజయ నాదాలతో
మారు మ్రోగుతున్నవి
అదుగో! మన నదులలో
ఆనందం ప్రవహిస్తున్నది
అదుగో! మన గాలిలో
ఆత్మ గౌరవం విహరిస్తున్నది
భరతమాత గర్విస్తున్నది-

యుద్ధం ముగియలేదు
యుగయుగాలుగా సాగుతున్న
యుద్ధం ముగియలేదు
పైశాచిక అసుర శక్తులు
ప్రజాశక్తికి, దివ్య శక్తికి
లొంగి పోయాయేకాని
సమూలంగా నాశనం అయినట్లు
సాక్ష్యం కనుపించదు-
ధర్మ-అధర్మాల మధ్య యుద్ధానికి అందుకే
శాశ్వత విరమణ సంభవించదు
ప్రమత్తత ప్రమాదం అని
అనవరతం మేల్కొని ఉండాలని
చరిత్ర హెచ్చరిస్తున్నది
చైతన్యం మనల వరిస్తున్నది
భరతమాత గర్విస్తున్నది
భరతజాతి గర్విస్తున్నది.

(1972)

# తామ్రపత్రం

ఢిల్లీలోని-లాల్ ఖిల్లాలోని
"దివానె ఆం" లో
క్రొత్త దీపం ఒకటి వెలిగింది
దివ్య రూపం ఒకటి కదిలింది
పొంగిపడే స్మృతి తరంగాల
గంభీర సాగర నయనాలతో
తరతరాల పారతంత్ర్య నిగళాలను
పౌరుషంతో తెగగొట్టిన హస్తాలతో
అందుకున్నాడు స్వాతంత్ర్య యోధుడు
అమృతమూర్తి భారతేందిర
అందించిన అభిమాన పత్రం
అమ్లాన స్వేచ్ఛా జీవన చిత్రం
తామ్ర పత్రం-

ఆనందంతో కరిగి పోతున్న అతనికళ్లను
ఆవేశంతో ఊగిపోతున్న అతని కరాలను
విజయ భారంతో వంగిన అతని నడుమును
వినమ్రతా భావంతో తడబడే అతని పాదాలను
అద్దుకొన్నది భరతావని తనగుండెకు;
అందించింది కృతజ్ఞతా పత్రం
స్వాతంత్ర్య విజయ ఛత్రం
తామ్ర పత్రం-

ఏమిటీ ? ఏమటిదంతా !
ఏమిటి ? ఏమిటీ ఈ వింత !
పాతికేళ్ళ స్వాతంత్ర్య లక్ష్మి
పండుగ చేసు కుంటున్నది

సర్వస్వం తన కోసం
త్యాగం చేసిన
స్వాతంత్ర్య యోధులను
సన్మానిస్తున్నది
భరత మాతృ
పవిత్ర నేత్రాలలో
భవిష్యద్దీపాలు వెలిగిస్తున్నది-

మరచి పొమ్మంటున్నది
అపమానాలను, అపజయాలను;
తలచు కొమ్మంటున్నది
సన్మానాలను, దిగ్విజయాలను;
చీకటి తాకలేని లోకం వైపు
శీఘ్ర గతిని సాగమంటున్నది.

స్వాతంత్ర్య యోధుడు
స్వర్ణాక్షర తామ్రపత్రం కోసం
సాచిన హస్తం
చరిత్రలో స్వర్ణయుగాన్ని చిత్రించిన
చైతన్య స్రవంతిలా భాసించింది
భవిష్యత్తుకు భద్రభిక్ష పెట్టే
దీక్షాశిఖరంలా దీపించింది.

అపూర్వ త్యాగాశక్తి నిండిన
అతని ముఖ మండలం నుంచి
లీలగా తొణికి పడ్డ దరహాసంతో
రాగారుణమైంది ఎర్రకోట
రసార్ణవం అయింది దివానె ఆం.

విశాల కాలనిశాఫాలం మీద
విప్లవోషస్సులు పండించిన
అతని విముక్త కరాగ్రాలు

భరత జాతి జీవన ప్రాంగణంలో
ప్రగతి దీప స్తంభాలు
ఆసేతు హిమాచలం
ఆవరించిన ఆతని కరతలంలో
మానవతా జ్యోతిలా వెలిగే
తామ్ర పత్రం
మనల నెల్లప్పుడు
మహా విజయ మార్గంలో నడిపించే
మహోజ్వల నేత్రం
తామ్రపత్రం. -

(1972)

# ప్రజాబంధు రాజాబహదుర్

ఏడీ! రాజా బహదుర్ వెంకటరామారెడ్డి
ఎక్కడా కనిపించడేం !
తన శతజయంతి ఉత్సవాలలో
తానే ఎక్కడా అగుపించడేం !
అధ్యక్షా !
అతనికి ఆహ్వానం పంపించలేదా ?
ఈ మధ్య ఆయన ఎక్కడఉన్నదీ
ఎవరికీ తెలియదా ?
మనం సాధించిన ప్రగతి చూచి
అతనికి సంతృప్తి కలగదనుకున్నారా ?
అయినా, అతనికి ఆహ్వానం కావాలా
తన ఇంటికి తాను రావటానికి ఒకరి పిలుపు కావాలా !

అయ్యో ! మనం గమనించనే లేదు
అదుగో అక్కడే నిలుచొని ఉన్నాడాయన
నమస్కారం రాజాబహదూర్
అంత దూరంగా నిలుచుని ఉన్నారా
మీ ఉత్సవాల సందడిలో
మిమ్మల్నే మేము గుర్తుపట్టలేదనుకున్నారా
రండి రండి
వేదిక మీదికి దయచేయండి
అధ్యక్షుల అనుమతితో
అందరి పక్షాన ఆహ్వానిస్తున్నాను రండి
మా కృతజ్ఞాతాక్షరమాల స్వీకరించండి -
ఆరిపోని దీపం వెలిగించి
అగుపించకుండా పోయారు మీరు
జాడతెలియకుండా పోయారు మీరు

మిమ్మ కళ్ళతో చూడని చిన్నవాళ్ళం మేం
అయినా మీ వెలుగు ఛత్రం క్రింద
కులాసాగా ఉన్నవాళ్ళం
మీరు పెట్టిన విద్యా గంధంతో
బ్రతుకులు పండించుకుంటున్నవాళ్ళం

హైదరాబాదు ఎంతమారిపోయిందని
ఆశ్చర్యంగా ఉందికదూ మీకు,
ఆంధ్రప్రదేశ్ పరిస్థితి చూస్తుంటే
అయోమయంగా ఉందికదూ మీకు,
నాలుగు భాషలు మాట్లాడేవాళ్ళు
నవ్వుల పువ్వులు రువ్వుకునేవాళ్ళు నాడు
ఒకేభాష మాట్లాడే తెలుగు వాళ్ళు
ఒకరిపై ఒకరు రాళ్ళు రువ్వుకుంటున్నారు నేడు !
నమ్మినదేదో చేశారు మీ రానాడు
తామునమ్మనిదాన్ని నమ్మిస్తున్నారు నేడు -

తలపులు మూసి లోనికి రమ్మనేవాళ్ళు
పొమ్మనలేక పొగబెడుతున్న వాళ్ళు
నవ్వలేక ఏడ్చేవాళ్ళు
ఏడ్వలేక నవ్వేవాళ్ళు
సంఘంలో ప్రతిరంగంలో పెరిగిపోతున్నారు
మీ వంటి వారున్నారంటే నమ్మలేమంటున్నారు -

మీ పేరులో కులం ఉంది
కాని మీకు కులతత్వం లేదు
ఇప్పుడు పేర్లల్లో కులం కనిపించకపోయినా
కులతత్వం వెర్రితలలు వేస్తున్నది -
'ఎందరో మహానుభావులు'
అందరూ అంధకారంలో
ఓ దీపం వెలిగించిన వాళ్ళే,
మీరుమాత్రం జీవితాన్నే

ఆరని దీపంగా వెలిగించారు !
నాడు అధికారాన్ని
ప్రజాక్షేమంకోసం ఉపయోగించటం మీకుతెలుసు
నేడు అధికారాన్ని
క్షేమం కోసమే ఉపయోగిస్తున్నారు
తమ సొంత క్షేమం కోసం !
మీ చేతిలో అధికారం నిత్యదీపమై వెలిగితే
నేడు సుడిగాడ్పయి
ఉన్నదీపాలను ఊదేస్తున్నది
చీకటితో స్నేహం చేస్తున్నది
అలా తగదన్న వాళ్ళ కళ్ళల్లో
దుమ్ముకొడుతున్నది –
పరిమితమైన పొలంలో మీరు
త్యాగమనే నాగలి పట్టి
ఎంతో కొంత ప్రేమను పండించారు
సువిశాలమైన క్షేత్రంలో మేము
స్వార్థమనే ట్రాక్టర్లు పెట్టి
బోలెడంత ద్వేషాన్ని పండిస్తున్నాము !
అందుకే మీరిక్కడే ఉండిపోవాలంటున్నాను
అందరి డెందాలలో అమృతం పండించాలంటున్నాను
మీ రెండవ శత జయంతి ఉత్సవాలకు
మేము హాజరు కాలేకపోవచ్చు
అయినా ఆ మహా సభలు
ఇంతకన్నా శోభాయమానంగా వెలిగిపోవచ్చు
కోత్వాల్ వెంకటరామారెడ్డి గారూ
ఇక మా రక్షణ భారం మీరు వహించవచ్చు. (1972)

(12-11-1972 నాడు రాజాబహదూర్ వెంకట రామారెడ్డి శతజయంతి ఉత్సవాల సందర్భంలో హైదరాబాదులో జరిగిన బ్రహ్మాండమైన కవిసమ్మేళనంలో పలికిన కవిత)

# ప్రమోద ప్రబోధాలు

చావు-పుట్టుక
ప్రకృతి ధర్మం
ప్రకృతిని జయించడం
ప్రగతి ధర్మం
ప్రకృతి సిద్ధమైన చావును
పలు విధాల నిరోధించడం
ప్రకృతి విరుద్ధం కాదుగదా
పరమ పుణ్యం కూడ
ప్రకృతి సహజమైన పుట్టుకను కూడా
పని గట్టుకొని నిరోధించడం
పుణ్యం కాదా ? పరమ పుణ్యం-

అందుకే
సంతాన నిరోధం
కుటుంబ నియంత్రణం
కావలంటున్నాను కావ్యవస్తువులు
సహజ సుందర కవితా వస్తువులు
సమాజాభ్యుదయ సౌధానికి పై అంతస్తులు-

అభ్యుదయోన్ముఖి నా లేఖిని
అమృతం కురిపిస్తున్నది
కావ్యామృతం కురిపిస్తున్నది
పరిమిత కుటుంబాలపై
ప్రజాహిత మితకుటుంబాలపై -
పుట్టినవాడు గిట్టకూడదు
మెట్టాలని కోరుకుంటాం
మెట్టలేక గిట్టేవాడూ
పుట్టకూడదని కోరుకుందాం-

ట్రాఫిక్ పోలీసులు లేని
ట్రాఫిక్ లైట్లూ లేని
క్రాస్ రోడ్ల వద్ద కాట్లాడే జనవాహన సమూహాలు
ఏ రిజర్వేషనూ రెగ్యులేషనూ లేని
జనతా రైలు పెట్టెల్లో ఊగులాడే ప్రయాణీకులు
మనమదిలో మంటలు లేపినట్లే
నియంత్రణ లేని కుటుంబాల యాతనలు
నిలువునా నీరు చేస్తాయి మనల్ని ?

గిరాకీ లేని వస్తువుల్ని
కావాలని ఉత్పత్తి చేయుడం
కాదా మూర్ఖత్వం ?
దిక్కులేని సుఖపెట్టే మొక్కులేని సంతానాన్ని
దివాళా తీస్తున్న
దేశ జనాభా మార్కెట్లోకి దిగుమతి చేసుకోవడము
కాదా మూర్ఖత్వం,
మరికాదా పశుత్వం-

నీరులేని చెరువుల్లోకి
నోరులేని చేప పిల్లల్ని వదలకండి
మోడుబారిన తోటలోనికి
ముగ్ధ కోకిలలను త్రోయకండి
కంటక జీవిత పథాలమీద
చంటి వాళ్ళను వదిలేయకండి
సంతాపంలో ముంచడానికి కాక
సంతోషం పంచడానికి
సంతును కనండి-

పవిత్రమైన మాతృగర్భం నుంచి వెలువడే
ప్రతి మనిషి సుఖపడాలి
పాప మెరుగని ప్రాణుల్ని

పంత బ్రతుకుం బజారులో కనేసి
పవిత్ర మాతృ పితృత్వాలను
అపవిత్రం చేయకండి
మీ సుందర స్వప్నాలకు రూపంగా
ఒక గౌరినో
ఒక శౌరినో కనండి !

యువ దంపతులారా
నవజీవన ప్రణయ శాఖలారా
అధిక సంతతి సంతను సృష్టించి
అమాయకుల మనుగడలను
పీడకలలు చేయకండి
పరిమిత కుటుంబ నౌకల్లో
ప్రమోద కవితా స్రవంతుల్లో తేలి
ప్రగతి జీవన తీరాలు చేరండి.

(1973)

# ఆరు రంగుల హరివిల్లు

ఆరు రంగుల హరివిల్లు విరిసింది
ఆకాశంలో
ఏడవరంగేది ? ఆ రంగేది ?
"అది అందరి అంతరంగాలలో దాగివుంది
"అనురాగ రేఖ అది" అంటూ
నా సుప్తభావనా శారిక
రెక్కలార్చింది—

అదుగో ! అది షడ్వర్ణ మాలలా లేదు
సిగ్గుతో తల వంచిన వధువు కంఠంలో
వద్దు వద్దు నాకు పెళ్లి వద్దన్న వరుడే
ముద్దుగా వేస్తున్న పూలమాలలావుంది—

ఘోరున కురిసిన వర్షం వెలిసింది
ఉరిమిన, ఆబాలగోపాలాన్ని వీధుల వెంట తరిమిన
మాయ మబ్బుల గొంతుకలు చల్లబడ్డవి
సాంధ్య రాగంలో
ఇంద్ర చాపం వెలువడ్డది
తూర్పుపడమరల మధ్య
ఉత్తర దక్షిణాలు కట్టేస
ఉజ్వల భవిష్యత్తుతోరణంలా రెప రెపలాడుతున్నది—

ఉప్పొంగిన గోదావరి
ఉవ్వెత్తున శివమెత్తిన కృష్ణానది
శృతి తప్పిన గతి తప్పిన మంజీర
తల్లి కళ్లల్లో వరదలునించి
ఆమె తెల్లని మల్లెమనస్సులో బురదచిమ్మి
అలసిపోయి
ఆయమ్మ ఒడిలో నే ఒరుగుతున్నాయి

వాన వెలిసింది
వరద తగ్గింది
బురద మారింది
అందులోనుంచి అరవిందాలు పూస్తున్నాయి-
చెరిగిన స్వప్నంలో నుంచి
పవిత్ర వాస్తవికతా చిత్రంఏదో
మన కళ్లలోకి, కాదు కాదు
కలత పడ్డ గుండెల్లోకి తొంగి చూస్తున్నది;
అనుమాన అవమాన పంకిలాన్ని కడిగివేసి
ఆశయాల ఆదర్శాల పాత్రలో
అభిమాన అనురాగ అమృతం పోసి
తనకు అందిస్తారని
తనను నవజీవన లక్ష్మిగా ఆదరిస్తారని
ఆశిస్తున్నది-

విరిచి వేయకండి ఆ హరివిల్లును;
త్రుంచివేయకండి ఆ
శాంతనభస్సరోవర పద్మాన్ని;
తుడిచివేయకండి
సంక్షుభిత సాగర సంభూత స్వప్న రేఖను-
ఉషాబాల నిర్మిస్తున్న
స్నేహరాగ సుందర సౌధంలో
ద్వేష మూషికాల
నిషా పేషల్ని చొరనీకండి
మట్టిలో పిచ్చుక గూళ్లు కట్టే
మలినమంటని పిల్లల్ని చూడండి
మనస్సుల్లో మచ్చిక గూళ్ళు కట్టే
మనీషులుకండి

(1973)

(తెలుగు దేశాన్ని ఉన్మాదంలో ముంచిన ఉభయోద్యమాల తర్వాత)

# ఉగాది సరసాలు

తరిగిపోతున్న సరకులు
పెరిగిపోతున్న ధరలు
విరిగిపోతున్న జీవితాలతో
సరసాలాడుతున్నవి
దాగుడుమూత లాడుతున్నవి-
సరకులు తరిగిపోతేనే
ధరలు పెరిగి పోతున్నాయి
కాదు కాదు
ధరలు పెరిగిపోతుంటేనే
సరకులు తరిగిపోతున్నాయి-
చల్లగా తరిగిపోతున్న సరకులను
సామాన్యుడు చేరకుండా
మండి పోతున్న ధరల కుక్కలను
కాపాలా పెట్టారు బేహారులు
సరకులు ముఖ్యం సామాన్యునికి
ధరలు ముఖ్యం బేహారికి-
అగ్గిలా మండుతున్న ధరలను చూచి
సిగ్గుతో
చీకటి ముసుగు వేసుకుంటున్నాయి సరకులు-

ఉత్పత్తి కాలేమంటున్నవి కొన్ని సరకులు
ఉత్పత్తి కామంటున్నవి మరికొన్ని సరకులు
ఉత్పత్తి అయిన సరకులైనా
ఉన్నచోటే ఉండి పోతామంటున్నవి
కావలసిన వారి గుమ్మంలో
కాలు పెట్ట మంటున్నవి
గోదాముల్లో గోష్ఠి చేసే
పేదవాళ్ళ పెన్నిధి సరకుల్ని
మత్తేభాల్లాంటి పొగబండ్లు
మోయలేమంటున్నవి

"కోరికలు తగ్గించుకోండి
కొనడం మానేయండి
చాలు చాలై పోతాయి సరకులు
చెప్పినట్లు వింటాయి ధరలు"
సలహా ఇస్తున్నది ఓ కంఠం.
"కోరికల్ని పెంచుకోండి
కొనుగోలు శక్తి పెంచుకోండి
సరకుల ఉత్పత్తిని పెంచండి
అందరికి సమానంగా పంచండి"
ప్రతిపాదిస్తున్నది మరోకంఠం-
ఉన్న సరకుల మధ్య
బాధపడుతున్న వినియోగదారుల మధ్య
వియోగం ఏర్పడింది
వాళ్ళను ఎడబాపే ధరల అఖాతాలపై
వంతెనలను కట్టలేక
వగస్తున్నది సాంఘిక వ్యవస్థ;
పరిష్కారాలు సమస్యలై పోతుంటే
పరితపిస్తున్నది పాలనా వ్యవస్థ,
సామాన్యుడు, నిస్సహాయుడు
విస్తుపోయి వింటున్నాడు వింత గొంతుకలను
వస్తుపోయి కంటున్నాడు పరిపాలకుల అవస్థలను
తీరని ఆశల బెల్లాన్ని
మారని అనుభూతుల వేపపూవుల్ని
మండే ఆమని చేతులనిండా కాచిన
మామిడి కాయల్ని
తన గుండె చిప్పకుండలో పచ్చడిచేసి ఇస్తున్నాడు
ఆవేదనల అరణ్యరామునికి
ఆనందనామునికి.

(1974)

# దేశం ముందడుగు వేయాలి

కాలం కళ్లలో చీకట్లు క్రుమ్మిన
కారడవుల్లో నుంచి
ప్రగతి పథాలను అడ్డిన
పర్వత శిఖరాల నుంచి
ఆశలను మట్టిలో కలిపిన
ఊసర క్షేత్రాల నుంచి
వినిపిస్తున్నది విప్లవ సందేశం!
వేయాలి, ముందడుగు వేయాలి దేశం!

కరిగిపోయి కల్లాగ దొరలిపోయి
కడలి పాలౌతున్న నదీనదాలు
ప్రజా చైతన్య శంఖారావ మోహితలై
పచ్చ పచ్చని విప్లవ భావ తరంగితలై
కొలువు తీరాలి కొండల్లో కోనకోనల్లో
నంగల్ భాక్రాలో, నాగార్జున సాగర్‌లో
నవజీవన హస్తాలుసాచి, దళిత భూములతో
హోళీ రంగేళీ ఆడుకోవాలి
విద్యుద్ధరహాసము చిందుతూ
ఇంటింటా పాడు కోవాలి
వేయాలి ముందడుగు వేయాలి దేశం!
వినిపిస్తున్నది విప్లవసందేశం!

ప్రఫుల్ల భారత గంధవతిని
ప్రశస్త భారత రత్నాకరాన్ని
ప్రసన్న భారత మహాబిలాన్ని
యోధవర శైలాట శతఘ్నులు
వీర మరుత్ గరుత్ విమానాలు
విక్రమ నక్ర నౌకాబలాలు

దీక్షా దక్షతంతో రక్షించాలి
దుష్టనికృష్ట శత్రువులను శిక్షించాలి
వేయాలి ముందడుగు వేయాలి దేశం !
వినిపిస్తున్నది విప్లవ సందేశం-

కల్తీలతో తిండిని విషం చేస్తున్న
కసాయి వాళ్లను
దొంగ నిలువలతో నీ బ్రతుకు విలువలు దోస్తున్న
నీచపు తోడేళ్లను
సిమెంటును బూడిద చేస్తున్న మాయావులను
నూనెను గోమూత్రం చేస్తున్న బాబూలను
నీతిని కాటేస్తున్న భుజంగాలను
జాతిని త్రుంచేస్తున్న ప్లవంగాలను
రవిని మింగేస్తున్న సైరవిగాళ్లను
కసంత్రొక్కి నీ పాదాలక్రింద నలిచేయి
పదునెక్కిన నీ ప్రతిభా శూలంతో నులిచేయి
ఉత్తిష్ఠ ! ఉత్తిష్ఠ తమ్ముడూ మేలుకో !
నిస్త్రాణ నిరీహతనుంచి తేలుకో !

అయిదు అయిదు అడుగులు వేస్తున్నది
అభివృద్ధి ప్రణాళికా ప్రసవంతి
ప్రతి అడుగున ఆమెను ముంచేస్తున్నది
అతి రభసంగా పొంగుతున్న జనాభా స్రవంతి
ఆ పవిత్ర ప్రసవిత్రి ప్రస్థానాన్ని
సఫలంచేయ నడుం కట్టు
ఆ ప్రమాద కల్లోలిని దాడిని
నిరోధించు, నియంత్రించు, అరికట్టు !

భిలాయిలో, రూర్కెలో, విశాఖలో, సేలంలో
ఉక్కు కవచాన్ని ధరించి

జె. బాపురెడ్డి

కృష్ణా కావేరిసీమల్లో
గంగా యమునా మైదానాల్లో
ఉజ్వల మరకత చేలాంచలాలు సవరించి
ఆత్మ శక్తిని, అణుశక్తిని
అప్రతిహత సాధనాలుగా స్వీకరించి
భారతీయ ఆర్థికవ్యవస్థ
వీర యోధినిలా విజృంభించాలి
తరతరాల దరిద్రాల కంఠాలు
కర కర తెగి నేలకూలాలి
నిర్నిమేష, జిజీవిష
నిర్మలంగా నిబిడంగా వెలగాలి
ఓహో ! అలా అంటున్నది ఎవరు ?
బాపు-
చీకట్లను చీలుస్తున్న తూపు
మనలను నడిపిస్తున్న ముందు చూపు.

(1974)

# బాలలు ఏలాలి ఈ దేశం

బాలలారా ? మీరే పాలించండి
ఈ భారతదేశాన్ని
పెద్దలతో కాదిక ఈ దేశాన్ని ఉద్ధరించడం
చిన్నవాళ్ళేకావచ్చు మీరు
అయినా
చెడుకు, చెరుపుకు దూరంగా ఉన్నవాళ్ళు మీరు –
అనుభవం లేని వాళ్ళే కావచ్చు మీరు;
అన్యాయాలలో అక్రమాలలో
అనుభవం లేని వాళ్ళు
అనురాగాలు పెంచడంలో
ఆనందాలు పంచడంలో
అనుభవం కలవాళ్ళు మీరు–

తత్వాలు తెలియని వాళ్ళైతే కావచ్చు మీరు;
సంకుచి తత్వాలు–
స్వార్థపరత్వాలు
తెలియని వాళ్ళు మీరు
ఐకమత్యానికి, అమల సత్యానికి
ఆదర్శ మూర్తులు మీరు
అందుకే, మీ నిర్మల హృదయాలతో పాలించండి
అంధకార మాలిన్యంలో చిక్కిన దేశాన్ని–
మీ లోకంలో
మీ ఆశల, ఆశయాల. ఆలోచనల లోకంలో
వెలుగు రహదార్లు తప్ప
చీకటి బజార్లు లేవు
విజ్ఞాన విహారాలు తప్ప
విలయ నాట్యాలు లేవు

స్నేహ పీయూషాలు లేవు
విద్వేష విషాలు లేవు
సౌహార్ద సౌజన్య వసంతాలు తప్ప
స్వార్థ సంకుచిత శిశిర ఘాతాలు లేవు
పూలు తప్ప కంటకాలు లేవు-

హింసా రిరంసలకు దూరంగా ఉన్న
పరమ హంసల్లారా, బాలల్లారా :
మీ లోకంలో
అన్నయ్యలు, అక్కయ్యలే కాని
కీచకులు శూర్పణఖలు లేరు
వెన్నదొంగలే కాని
వెన్నుపోటు దొంగలు లేరు
బాలకృష్ణులు, బాలచంద్రులే కాని
కంసులు, నాగమ్మలు లేరు
అందుకే, మీరే ఈ దేశాన్ని పాలించండి
మమ్మల నందరినీ మీలాగ మార్చండి-

సంపదలను కొల్లగొట్టే వాళ్ళను
సాగరంలో ముంచండి
దొంగ నిలువలు చేసే వాళ్ళను
దూర తీరాలలో పాతిపెట్టండి
కత్తిలు చేస్తున్న కసాయి వాళ్ళ
కంఠాలకు ఉరిపెట్టండి
లంచగాళ్లను, దగాకోర్లను
వేషగాళ్లను, మోసగాళ్లను
పసికట్టండి, తుడిచిపెట్టండి
మీ పసి పసిడి చేతులతో
చిన్నారి చిగురు ప్రేమ్నతో
భవిష్యత్తుకు పచ్చతోరణాలు కట్టండి

బాలలు పాలించే దేశంలో
బాధలు, ఈతి బాధలు ఉండవు
ఆకలి మంటలు ఉండవు
కులతత్వాలు, మతకలహాలు ఉండవు;
పెరగండి మీరు
బుద్ధిగల, చిత్తశుద్ధిగల
బాలలుగానే పెరగండి
ఈ జాతి జీవన జ్యోతులుగా వెలగండి
ఈ దేశాన్ని మీరే పాలించండి.

(1974)

(1984లో అఖిలభారత బాలల మహోత్సవాలు హైదరాబాదులో జరిగినప్పుడు విరిసిన కవిత)

# అంబేద్కర్ శరణం గచ్ఛామి

చైతన్య మహానదివై
భరతఖండం నిండా ఆవరించిన నీవు
శిలవై పోయావా !
దళిత జాతుల హృదయ కుహరాలలో
ఆశాదీపంగా వెలగిన నీవు
కలవై పోయావా !
సంపూర్ణ స్వాతంత్రం కోసం
సర్వస్వం త్యాగం చేసిన నీవు
భారత స్వరాజ్య లక్ష్మికి
పవిత్ర రాజ్యాంగాన్ని ప్రదానం చేసిన నీవు
శిలవుకాదు - కలవుకాదు
మానవతా వాద శిఖరాల
మంచు మలవు
ఎలా అర్పించను నీకు జోహారులు
ఈ నీ జన్మదినోత్సవం నాడు
వెలుగు చీకట్ల మధ్య పోరాటం
విజృంభిస్తున్న నేడు—

ఇన్నేళ్ల స్వరాజ్యరమ
ఎన్ని ఎన్నికల వేడుకలు చేసినా
ఎన్ని ప్రగతి పథకాలు వేసినా
నీవు ఆశించిన జాతి స్వాతంత్ర్యం
నిజం కావటం లేదు—
డెమోక్రసీని
హిపోక్రసీ నడిపిస్తున్నది
ప్రజా జీవితాన్ని
స్వార్థం పట్టి పీడిస్తున్నది

సమానత్వం ఆశించే వాళ్లకు
అసమానత్వం సమానంగా లభిస్తున్నది ;
నీకు తెలియందేముంది
బాబా సాహెబ్ అంబేద్కర్ !
మన పెద్దమనుషుల బుద్ధులు
మారువేషాలు, మాయవేషాలు వేస్తున్నాయేకాని
మారడం లేదు
శంకరాచార్యుల "మాయావాదం"
చేస్తున్నది దేశంలో గారడినేడు
ఉన్నాయంటే అన్నీ ఉన్నాయి దేశంలో
లేవంటే ఏవీలేవు - అంతా మిధ్యా
అస్పృశ్యత పోయిందా అంటే
పోయింది
ఋజువు అడుగొద్దు
పోలేదంటే పోలేదు
కారణాలు అడుగొద్దు-
మతం నల్లమందని అంటే
మధు పానంలా దాన్ని సేవిస్తున్నారు
కులభేదాలు పోవాలని నీవంటే
కులాల వారిగా సంఘాన్ని విభజిస్తున్నారు
"కులనిర్మూలనం" నీవు కోరితే
మాటను కొంచెం మార్చి
కుల నిర్మాణం చేస్తున్నారు
కులవ్యవస్థను పునర్నిర్మాణం చేస్తున్నారు
నిన్ను పబ్లిక్‌గా స్మరిస్తున్నారు
ప్రయివేటుగా విస్మరిస్తున్నారు-
అపూర్వమూ అమోఘమూ అయిన
భారతీయ కులమత పద్మవ్యూహాన్ని
ఛేదించలేక నీవే

"బుద్ధం శరణం గచ్ఛామి" అంటే
చావగా మిగిలిన సంఘ సంస్కర్తలు
"మరణం శరణం గచ్ఛామి" అనుకుంటున్నారు.

మళ్లీ ఒకసారి అవతరించు అంబేద్కర్
"సంభవామి యుగే యుగే" సిద్ధాంతాన్ని
సమర్థిస్తున్నానని కోపగించవద్దు
అవతారపురుషుడు వస్తేనే తప్ప
ఈ దేశంలో ఏ కాలంలోనూ
అధర్మాన్ని అణచడానికి వీలులేదు
పదకొండవ అవతారం ఎత్తిరా
విష్ణువు అవతారంగా కాదు
మరో బుద్ధుడుగా కూడా కాదు
శివావతారంగా రా
ధర్మరుద్రావతారంగా రా
నీ ఆశయాలకు చెదరిపోని
ఆకారం కల్పించడానికి
అంతరంగాలలో దాగిన
వింత శత్రువులను జయించటానికి
కావలసిన ఆయుధాలు ధరించి
అర్జంటుగా వచ్చేయి-

(1974)

# దృష్టి-సృష్టి

కళ్ళిస్తున్నావా ? డాక్టర్
కళ్ళిస్తున్నావా !
చూపు-ఇస్తున్నావా ! బ్రతుకు
చూపిస్తున్నావా !
కరుడు కట్టిన కాళరాత్రిని
కాంతి శస్త్రంతో చీలుస్తున్నావా !
ఆరిపోయిన దీపాలను మళ్లీ
అద్భుతంగా వెలిగిస్తున్నావా !
శివుడవై, మాధవుడవై
సాక్షాత్ బ్రహ్మవై
శిలలో జీవం పోస్తున్నావా
సృష్టికే దృష్టిని ప్రసాదిస్తున్నావా !

పూర్వజన్మలో ఎంతటి
పుణ్యం చేసుకున్నావో
ఇందరి కనుదమ్ములలో ఈనాడు
ఇనుడవై వెలుగుతున్నావు
కవి హృదయంలో రవి హృదయంలో
కవితోషస్సులు పండిస్తున్నావు !

కళ్లున్నవాళ్లకు, కళ్ల లేనివాళ్ళ
కష్టాలు కనిపించవు
కలిమిగల వాళ్లను సిరుపేదల
కన్నీళ్ళు కరిగించవు,
కలిమిలేని కళ్లులేని వాళ్ల
కలలకు నీవు రూపం కల్పిస్తున్నావా !

కళ్లు మూసుకొని చూస్తున్నాను
కళ్లు లేని వాళ్లను
కళ్ళు తెరచి వాళ్లకోసం
కారుస్తున్నాను కన్నీళ్లను :
దృష్టి లోపించినపుడు
లోకం కీకారణ్యం
రంగులేదు రూపం లేదు
రాత్రి లేదు పగలు లేదు
నరలోకం లేదు సురలోకం లేదు
నరకలోకమే అంతటా అప్పుడు.

"సర్వేంద్రియాణాం
నయనం ప్రధానం"
అన్నారు అందుకే
సర్వ దానాలలో ప్రధానం
నీవు చేస్తున్న
లోచన ప్రదానం
లోకన ప్రదానం
అంటున్నాను
నీ అమృత హస్త స్పర్శతో
పునర్జన్మానుభూతిని పొందే
అసంఖ్యాక సోదరుల పక్షాన
నిన్ను కళ్ల కద్దుకుంటున్నాను.

(1974)

# ఆకాశవాణితో వాణి

ఆకాశవాణీ ! నీవాణి
అనవరతం వినిపిస్తున్నది
నీవు చేస్తున్న
వినోద విజ్ఞాన కళాసాగర మథనంలో
అమృతంతో పాటు
హాలాహలం కురుస్తున్నది
స్వతంత్రభావమణి ఖచితవీణపై
శారదలా నీవు చిందించే జీవనరాగాలలో
అపశ్రుతులు, అపస్మృతులు
చోటు చేసుకుంటున్నాయని
ఆత్మీయుడిలా నిన్ను హెచ్చరించాలనిపిస్తున్నది
అమ్మా ! నీవు అమాయకురాలివి
నీ జీవితాకాశంలో
అందరికి ఆశ్రయం ఇస్తున్నావు – మంచిదే కాని
ప్రతిభ కలవాళ్లెవరో
పైరవీ గాళ్లెవరో
పసిగట్టలేక పోతున్నావు
నీ నిసర్గ రసానందంలో–
సినీపాటల గోల కాస్తతగ్గించి
భావస్ఫోరక సాహిత్యాత్మక
స్వకీయ లలితసంగీతాలను వినిపించు
శ్రావ్యంగా వినిపిస్తున్న పాటల్లోని
సాహిత్య రాహిత్యాన్ని తొలగించు
నాటకాలలో
నవ్యతను, నాణ్యతను ఇంకా పెంచు
"ఆకాశవాణి"
కొందరికి అవకాశవాణి అవుతున్నది"

అంటున్న ప్రజావాణిని గమనించు
అడిగే వాళ్లనే
వెంటబడి తిరిగే వాళ్లనే ఆదరించక
అచ్ఛమైన ప్రతిభను అన్వేషించు - ఆహ్వానించు
నీకు ఉత్తరాలు వ్రాస్తున్న వాళ్లందరూ
చిత్తశుద్ధిగలవాళ్లే అని అనుకోకు
నీ నోట వాళ్ల పేర్లు వినాలని వ్రాసేవాళ్ళను
తమగురించి తామే వ్రాయించుకునేవాళ్ళను
తమకు గిట్టని ఉత్తరాలను
బుట్టదాఖలు చేసే వాళ్ళను
కొంచం నిఘాలో ఉంచు
నీ భవిష్యద్రథాన్ని
కులమత తత్వాతీత సమాజ సేవాక్షేత్రంలో
ఉజ్జ్వలంగా నడిపించు.

(1974)

# కడపలో కవిత్వం

"కడప" మీద కవిత్వం చెప్పమన్నాడు
కలక్టర్ సంజీవరెడ్డి
కడపలో కాలుపెట్టింది
కవిత చెప్పడానికే అన్నాను
కవిత అంటె ఏదో కవిత కాదు
కడప మీదే చెప్పమన్నాడు-
ఓపిక పట్టండి కాసేపు, సరే
లోపలికి, కడప లోపలికి వెళ్లి
చూచి చెపుతానన్నాను-

అడుగు ముందుకు వేయగానే
అందాల జీవకింకిణీ క్వణాల
కేసీకాలువ కేలు సాచి పిలిచింది.
పంటలెలా ఉన్నాయమ్మా అంటే
పంచాయితీ రాజ్యం వచ్చింతర్వాత
పరవాలే దంది
ఇవిగో-నిండుగా పండినసస్యాలు
తీయని బత్తాయీలు
తీరు తీరు అరటి పండ్లు
నీలైన నీటి పుచ్చకాయలు
బాగానే పండుతున్నాయి
తీసుకో-వీటిని
నీ కవితా వస్తువులుగా
చేసుకో అంది
తా స్తలోపలికి వెళ్లి చూస్తేనా
నా కనులు గనులై పోయాయి
నా చూపుల్లో

ఖనిజాల జాలు మెరిసింది
భవిష్యత్ సౌభాగ్యలక్ష్మి
నా భావనలో మెరిసింది
ఆనందంతో, ఆశ్చర్యంతో
అటూ ఇటూ చూడగానే
కోడూరు డెటర్జంటు ఫ్యాక్టరి
కొత్త కోడల్లా తళుక్కుమంది
"పరిశ్రమల కల్పతరువు
ఐడీసీ వెంకటరత్నం
అభ్యుదయ శీలి హరిశ్చంద్రుడు
ఈ ఇంటిలో వెలిగించిన దీపం
ఈమెయే
శ్రీ లక్ష్మిలా ఉందికదూ" అంటూ
సీమంతం నిమిరింది
పూర్ణకేశి పెన్నమ్మ-

నా మనస్సులో కదిలిన
ఊహలే వాస్తవాలై పోగా
కలక్టరును ప్రశ్నించాను
"కడపలోనే ఇంత కవిత్వం ఉంటే
నన్ను కవిత్వం చెప్పమంటారేమండీ" అని
కడప దాటి రాగానే
కళ్యాణ జగత్కళ్యాణేశ్వరుడు
వెంకటేశ్వరుడు కనిపించాడు
దవ్వుల నుంచి నవ్వుల పువ్వులు రువ్వుతూ
నన్ను ఆశీర్వదించాడు

(1974)

# చిరునవ్వుల తోటమాలి

నింగిలో చందామామ తొంగిచూచినప్పుడు
మనిషిలో ఆత్మీయత తొణికి పడ్డప్పుడు
నీవు ఈ లోకాన్ని విడిచి పోలేదని
నీవు మాకు నిజంగా దూరం కాలేదని
విశ్వసిస్తున్నాము
నిశ్వసిస్తున్నాము -

అర్థంలేని అర్ధరాత్రి
హఠాత్తుగా అదృశ్యమై పోయావు
నీవు ఎక్కడుండేది
ఏం చేస్తుండేది
చెప్పకుండా వెళ్లి పోయావు

నయాగర జలపాత చైతన్య ధారలో
నగ్నంగా ఆడుకుంటున్నావని కొందరు
మానవతా మంగళ "స్వరలహరి"లో
మౌనంగా పాడుకుంటున్నావని కొందరు
వాణి వీణా శ్రుతుల్లో
లీనమై పోయావని కొందరు
ఆకాశవాణి గళంలో
గానమై పోయావని కొందరు
నీ ఉనికిని గుర్తిస్తున్నారు -

స్వార్థం పరమార్థం అయిపోయిన నేటి
సంఘ జీవన శిశిరంలో
స్నిగ్ధసుకుమార సుందర స్నేహం వాడిపోకుండా
సుధాధారల క్రుమ్మరిస్తున్న
శశాంకుడివిగా
చిరునవ్వుల తోటమాలిగా
నిత్యం దర్శిస్తున్నాము నిన్ను అందరం
నీనిర్మల శ్రమా యాస ఘర్మ బిందువుల్లో
నీరై పోతున్నాం
కన్నీరై పోతున్నాం.

(1974)

# అందరిలో కందుకూరి

సాయుధ విప్లవాలతో సాధించలేని
సంఘ సంస్కరణను
సాహితీ సౌరభాలతో
సాధించిన కీర్తి శృంగం
కందుకూరి వీరేశలింగం !
అందుకో మా జోహారులు !
గోదావరి సరిత్తులాగ
గుండెను పొంగించావు
ఆదర్శాల, ఆచరణల తీరాలు
ఆవరించి ప్రవహించావు
స్వార్థాల మూర్ఖత్వాల
సంఘ జీవిత సైకతాలలో
క్రొత్త విలువలు పండించావు
కృషీ పండితుడుగా జీవించావు !

క్షీణ సాహిత్య క్షతగాత్రయైన
వాణి, నారదునికి వినిపించిన
వేదనా సందేశం విన్నావు
మూఢాచార నక్ర వక్ర దంష్ట్రా క్రకచాలలో
చిక్కుకున్న సమాజ గజేంద్రున్ని
దేశమాతను, భాషమాతను
దీక్షతో, వీరావేశంతో
రక్షించిన వీరేశలింగం పంతులూ !
మేలుకో అందరి డెందాలలో
మేఘావృత మహోజ్జ్వల నేత్రాలలో !

1887, డిశంబరు ఒకటవనాడు
తరతరాలు అనాథలను
కరకర కొరుక్కుతిన్న
వైధవ్య పిశాచానికి
వజ్రఘాతం కల్పించావు
వేదమంత్రయుక్తంగా
తొలి వితంతు వివాహం జరిపించావు
శిశిరం చిందులు త్రొక్కే
జీవిత సామ్రాజ్యాలను
వసంతుడవై ఏలుకున్నావు
రాజమహేంద్రవరాన్ని రాజధాని చేసుకున్నావు--

ప్రప్రథమ వచన ప్రబంధం
ప్రప్రథమ ప్రకృతి శాస్త్ర గ్రంథం
ప్రప్రథమ నాటకానువాదం
ప్రప్రథమ ప్రహసన నిర్మాణం
చేసినట్టి, తెలుగు కవుల చరిత్ర
వ్రాసినట్టి స్రష్టవు
చరిత్రను నిర్మించుకున్న ద్రష్టవు
అపూర్వ విజయధ్వజశోభితా
అందుకో మా కృతజ్ఞతా గుచ్ఛాలు-

చిరకాల దాస్య శృంఖలలు త్రెంచి
స్త్రీలు విద్య నేర్చుకోవాలని
అకాలమృత్యువుకు బలియైన
వితంతువులు వివాహం చేసుకోవాలని
దురాచార తాటకులను తెగటార్చి
ధరాతలాన్ని సురలోకం చేయాలని
పంతులూ నీవు మరీ మరీ చెప్పిన
పాఠాలను మేం మరచి పోలేదు

అయితే, తెలుగుదేశంలో
నీవు నాటిన వెలుగుతోటలు
నీరులేక, పెంపుచేసేవారు లేక
వెలవెల బోతున్నాయి
దురాచారాల, దుష్కృతాల శిశిరఘాతాలకు
విలవిల లాడు తున్నాయి -

మనిషిలో దాగి ఉన్న
స్వార్థం, సంకుచితత్వం, ద్వేషం
మారు వేషాలు వేస్తున్నాయే గాని
మారటం లేదు
ఎన్ని సంస్కరణలు చేసినా
ఈ జాతి జాతకం మారటం లేదు--
మట్టి దీపాలకు బదులు
విద్యుద్దీపాలు వెలిగించుకుంటున్నాం
కాని మనస్సుల్లోని తమస్సులను
వెలిగించలేకపోతున్నాం
నల్ల బజార్లలో ధర్మదీపం నిలపలేక పోతున్నాం
వెలుగులోకన్నా చీకటిలోనే మేము
వీర విహారం చేస్తున్నాం-

స్వేచ్ఛ కావాలన్నావు నీవు స్త్రీకి
ఇచ్చేశాం బోలెడంత స్వేచ్ఛ ఆమెకు
ఏమిటా స్వేచ్ఛ అంటున్నావా
స్వేచ్ఛలేదు అని చెప్పే స్వేచ్ఛ
స్వేచ్ఛ కావాలని స్వేచ్ఛగా అరిచే స్వేచ్ఛ
ఇచ్చేశాం బోలెడంత స్వేచ్ఛ--
బాల వితంతువులకు పెళ్ళిళ్ళు చేయమన్నావు
చేసేశాం

అయితే, పెళ్ళే వద్దని కూర్చున్న
పెద్ద బాలలు తయారయారిప్పుడు
సంస్కర్తా! వీళ్ళ సంగతేమిటి?--
కన్యాశుల్కం వద్దన్నావు నీవు
వరశుల్కాలు వచ్చి కూర్చున్నాయిప్పుడు
వీటి నేమి చేయమంటావు?

ఆడవాళ్ళను చదివించమన్నావు
చదివించాం
ఉద్యోగాలు రావటంలేదు సరికదా
వాళ్ళకు పెళ్ళిళ్ళు కావటంలేదు
ఇప్పుడు వీళ్ళనేం చేయమంటావు?
పరిష్కారాలు సమస్యలై పోతున్నవి
సంస్కరణలను స్వార్థాలు కాటేస్తున్నవి
అందుకే ఓ కందుకూరి!
అందరి డెందాలలో ఉండిపొమ్మంటున్నాను
అసురత్వానికి చోటులేకుండా
అంతటా నీవే నిండి పొమ్మంటున్నాను

(1974)

# శవాలు లేస్తున్నవి

శవాలు లేస్తున్నవి
సవాలు చేస్తున్నవి
ఏమని ?
తమ ప్రాణాలను హరించిన
తమో గర్భాలను చీలుస్తామని
తమశిథిల జీవిత సమాధి వీథుల్లో
తరుణ వసంతాలను వెలిగించి చూపుతామని
సవాలు చేస్తున్నవి-శవాలు లేస్తున్నవి.

పరమ శివుడు ఎవడో
ఈ శ్మశాన వాటికలో
నవజీవన తాండవం చేస్తున్నాడు
నందనందనుడెవడో
ఈ కంకాళ శల్య శలాకలతో
వేణుగానం చేస్తున్నాడు
చితికిన హృదయాలే శంఖాలై ఫీంకరిస్తున్నవి
ఆరిన ఆశారేఖలే అనల అనిల కీలలై హూంకరిస్తున్నవి
మంచు దాడులకు భయపడి
మట్టిలో దాక్కున్న పరిమళాలు
కిర్మీర పుష్పాలై కిల కిల నవ్వుతున్నవి
అదుగో !
జీవితాశలను కొరుక్కుతిన్న
చీకట్లు పారిపోతున్నవి
అమాయక ప్రాణాలను హరించిన
అబద్ధాలు బ్రద్దలౌతున్నవి
ప్రగతి గీతాన్ని అపశ్రుతులు పట్టించిన
పన్నగాల నోట మన్ను పడింది
జాతి నయన కాంతి బింబాలకు
పట్టిన జడతా గ్రహణం విడిచింది. (1974)

# ఇరువై రంగుల ఇంద్రధనుస్సు

అరాజకత్వ వర్షం వెలిసింది.
అలజడుల బురద బెడద తగ్గింది
భరతజాతి జీవనాకాశంలో
పవిత్రఆశల ఆశయాల
ఇంద్ర ధనుస్సు విరిసింది
మామూలు ఏడురంగులదికాదు
మహత్తర చరిత్రను చిత్రించే
ఇరువై రంగుల ఇంద్రధనుస్సు అది-
కోటి కోటి కోదండాలజవం
మేటి మేటి గాండీవాల గర్జారవం
రవరవం, నరనరం
జీర్ణించుకున్న ప్రజాశక్తి ఈ ఇంద్ర ధనుస్సు-
సత్యం నారులు సారిస్తున్నది
శివం శరాలు సంధిస్తున్నది
సుందరం విజయయాత్ర సాగిస్తున్నది
ఇరువై రంగుల ఇంద్రధనుస్సు
ఈదేశాన్ని పాలిస్తున్నది
దీనబలహీన జనావళికి అభయమిస్తున్నది-

లెండి లెండి సుషుప్తి సమాధుల నుండి
లెండి లెండి నిరాశానిర్భాగ్య గర్భాల నుండి
మీకు సజీవ సమాధులు కట్టిన
కటిక చీకటుల కతుపులు చీల్చండి
కుటిల కుతంత్రాల కుత్తుకలు ప్రేల్చండి
ఈ శ్మశాన వాటుల్లో
జీవచ్ఛవాలై పడి ఉండకండి
జీజీవిషులై శివులై తాండవించండి

మీ జర్జరిత శల్యా శలాకల నుండి
నవ చైతన్య వేణునాదం వినిపించండి
మీ నిస్తబ్ద నీరవ గళాలనుండి
విజయీభవ శంఖారావం వినిపించండి
"దున్నేవాడిది భూమి
దోపిడీది మరుభూమి
కష్టించేవాడే స్వామి శ్రమవ్యక్తికి నమామి"
అనిపాడుతున్నాయి
కొమ్మల్లో దాగుకున్న కోకిలలు
కోనల్లో మేలుకొన్న శిలలు
"ఫ్యాక్టరీలే మందిరాలు-పంటచేలే పూజాపుష్పాలు
మనిషే మనిషికి దైవం-మనదేశమే మన స్వర్గం"
అని ఆలపిస్తున్నది
మార్పుకు స్వాగతం పట్టిన మహోజ్వల జ్వాల
ఎదఎదలో పరిమళించే ఈ ఇంద్రధనుర్మాల -
అత్యవసర వస్తువుల్ని
అసూర్యం పశ్యలను చేసే
సంఘద్రోహాన్ని సమాజసేవగాచూపే
మాయ గారడీల పసికట్టాలి
ఇరువై రంగుల ఇంద్రధనుస్సును
ఇంటింటా ఎక్కుపెట్టాలి-

పసివాళ్ళను చదువుతల్లికిదూరంచేసి
యువకుల్ని ఉద్యోగలక్ష్మి వియోగుల్నిచేసి
కొందరికి గూడులేకుండా చేసి
ఎందరికో కూడులేకుండా చేసి
భరతజాతి జీవన ప్రాంగణంలో
ప్రళయ తాండవం చేస్తున్న దారిద్ర్య పిశాచాన్ని
స్వార్థం, మోసం, ద్రోహం

పాలుపోసి పెంచుకున్న విషసర్పాన్ని
అడుగడుగున ఎదిరిద్దాం-కూల్చివేద్దాం
ఆర్థిక విప్లవాన్ని సాధిద్దాం-
కులత్వాలు. మతకలహాలు, క్రుళ్ళిపోయిన ఆచారాలు
సృష్టించిన సాలేగూడు సమాజవ్యవస్థలో
చిక్కుకున్న అమాయకుల్ని రక్షిద్దాం
సామ్యవాద ప్రజాస్వామ్య పీఠంపై
సాంఘిక విప్లవాన్ని ప్రతిష్ఠిద్దాం.

(1975)

# మట్టి మాట్లాడుతున్నది

మార్పుకు స్వాగతం పట్టి
మట్టి మాట్లాడుతున్నది
"ఊపుడు కత్తెను కాను నేను
పెంపుడు చిలకను కాను నేను
నా బ్రతుకుతో తన బ్రతుకును ముడేసి
నా ఒడిలో తన కష్టాన్ని ఒలక బోసి
నన్నానంద స్యందనంలో ఆడించేవాడే
నా వరుడు"
అంటూ మట్టి మాట్లడుతున్నది
ఔను! ఔను! అని భారతి
ఆమోదముద్ర పడుతున్నది
ప్రగతి తల్లి పైకి తురాయిలో
పచ్చలు ప్రచలిస్తున్నవి-

కోట్ల కోట్ల నెలయేళ్ళ
బ్రతుకులు కొల్లగొట్టి
ఉత్తుంగ తరంగ డోలల్లో ఊగే
ఉదధీశులకు సమర్పించి
ఉన్నవాడికి ఊడిగం చేసిన
ఎన్నెన్నో నదీనదాలు
ప్రజాశక్తి పథకాలకు తల ఒగ్గి
మాడిపోయిన
బీళ్ళ నోళ్ళు తడుపుతున్నాయి
చితికి పోయిన పల్లెలలకు
ప్రగతిపాలు కుడుపు తున్నాయి. (1975)

# భాగ్యనగర భాగధేయం

పేదరాలు భాగ్యమతిని
ప్రేమించెను రాచవాడు
కొండవాగు మూసీనది
గుండె పొంగి పొరలాడెను
రాజూ - పేదా కలసిన రాగరహస్తీరంలో
ప్రభవించెను భాగ్యనగరి ప్రణయ భావనాశిఖరి
కులమతాల కుడ్యాలకు తలవంచని వల్లరి -
అబ్దము, దశాబ్దము, శతాబ్దములు ఒక్కొకటి
ఆందము, మరందము, నవానందముల నించ
భాగ్యనగరము హైదరాబాదు నామియై
పయనమ్ము సాగించినది పురోగామియై -
వజ్రాల గోల్కొండ దండ మెడలో దాల్చి
తరతరాల చరిత్ర తలనిండ ముడుచుకొని
భిన్న సంస్కృతుల శోభా చేలములు గట్టి
పలుభాషలను, యాసలను ముద్దుగా నేర్చి
పద పదమ్మున జీవనాదమ్ముల వెలార్చి
నాల్గు గోపురముల నాట్యమంటపములో
ఆడినది పాడినది అందాలనగరి
హైదరాబాదు అనుబంధాల నిర్ఘరి -

భావకవీ : చాలించుము
నీ భాగ్యనగర వర్ణన
కలల్లోనుంచి కమ్మని ఊహల్లోనుంచి
కాస్త వాస్తవం లోనికి రా !
ఆబిడ్స్‌లోనుంచి కాదు
అహమద్‌నగర్‌లో నుంచి రా
అమీర్‌పేట హరిజనవాడల్లోనుంచి రా
ఆదయ్యనగర్‌లోనుంచి రా

కళ్ళు తెరచుకొని రా కాలినడకన రా -
ట్యాంక్ బండ్ మీదినుంచి కాదు
టప్పాచబూత్రాలోనుంచి రా
కాలాడేరాలో కాసేపు తిరిగి రా
కైలాష్‌నగర్ కూడా చూచిరా
బంజారా హిల్సు వెళ్ళక
బాపూజీనగర్ నుంచి రా
సినీమా హాళ్లు చిమ్మేసిన జనంలో నుంచి రా
వచ్చావా !
అచ్ఛా- ఇప్పుడు చెప్పు
నీ హైదరాబాదు ఎలా ఉందో !
అందాల భాగ్యమతీనగరం ఏమందో-

భావకవిని కాదండీ నేను
బాపురెడ్డిని
మురికివాడల్లో ముక్కు మూసుకొని
మునీశ్వరుడైన లోచూపు రెడ్డిని-
నగరాన్ని నందనవనం చేద్దాం అని
చౌరస్తాలో కట్టిన బోర్డు క్రింద
చదువుకున్న సంస్కారి ఒకడు
ముచ్చటగా మూత్రం చేస్తున్నాడు
ప్రక్కవాడు పట్టించుకోలేదు-
సిటీముఖంమీద పిటీ వలె
చెలరేగిన 'చెత్త సంస్కృతి'ని చూచి
స్వీపర్లు ఉమ్మేస్తున్నారు
చీపుర్లు సిగ్గుపడుతున్నాయి -
వెల్లవేసిన వీధి గోడలమీద చిల్లర నినాదాలు
చిత్రమైన సినీమా పోస్టర్ల మీద
పేడా పిడతలు పిడత వివాదాలు

వికటహాసం చేస్తున్నవి
పరిష్కృతత అంటే మాకంటేనా అని
పరిహాసం చేస్తున్నవి -

మనిషిమీద విశ్వాసం పోయి
మతి చెడిన కుక్కలు
దొంగ భక్తుల గోల పడలేక
గుళ్లల్లోనుంచి పారిపోయిన దేవుళ్లను
బజార్లలో వెదుక్కునే పశువులు;
చీకటి బడిలో
సగటుమనిషి రక్తనాళతంత్రులమీద
సంగీతం నేర్చుకుంటున్న దోమలు;
ఇల్లలకుండానే పండుగ చేసుకొనే ఈగలు
ఏమంటున్నాయో తెలుసా ?
మా కంటే ఏ కవి వర్ణించగలడు
ఈ మహానగర సౌందర్యాన్ని -అని.
స్వార్థం సృష్టించిన ముష్టివాళ్లు
నగరంమీద ఎగబడి నానారభస చేస్తున్నారు
మేడలు రోడ్లను మింగేస్తున్నాయి
గోడలు పేవుమెంట్లను కొరికేస్తున్నాయి
హైదరాబాదులో బలవంతుడు
అశోకవనిలో హనుమంతుడు -

స్వచ్ఛంద ప్రేమలో పుట్టిన ఈ చారిత్రక నగరాన్ని
స్వచ్ఛంగానే ఉంచండి
మధురమైన అనుభూతులలో
ఎదిగిన మానవోద్యానాన్ని మలినం చేయకండి
కడుపు నిండ కనేస్తున్న మన నగరమ్మను
కళామయిని చేయండి
అని
గోల్కొండ గోరీలనుంచి గొంతెత్తి హెచ్చరిస్తున్నారు
ఎవరు ?
భాగ్యమతి, ఆమెపతి కులీ ఖుతుబ్ షా భూపతి. (1975)

# భాష - భావం

భావం
భాషను తరిమేస్తున్నది
భాష
భావాన్ని వదిలేస్తున్నది-
విప్లవావేశంలో వెర్రి ఆక్రోశంలో
విడిపోయిన భాషాభావాలు
ఒకటి నొకటి వెలివేస్తున్నవి -

భావంలో జీవం లేదని
భాష పలవరిస్తున్నది
భాషలో జవం లేదని
భావం కలవరిస్తున్నది
భావం తనను అనుమానించిందని
భాష ఫిర్యాదు చేస్తున్నది
భాష తనను అవమానించిందని
భావం దావా వేస్తున్నది
ప్రబంధాలలో ఇవి రెండూ
చిలకా గోరింకల్లాగ కలిసి కాపురం చేసేవని
పండిత ఉవాచ -
భావ కవిత్వం భాషను వదిలేస్తే
అభ్యుదయ కవిత్వం
ఆకాస్త భావాన్ని త్రోసేసిందని
ఆధునిక పరిశోధకుని ఉవాచ -
కలపడం కాపురాలు నిలపడం తప్ప
కలహాల జోలికి పోని
భావాసక్త నా హృదయం
భాషానురక్త నా హృదయం
భాషా భావాలకు రాగ రసానుబంధం వేసి
అమృతానుభూతులు పంచుతున్నది
ఆక్షరాక్షర గీతులు నించుతున్నది. (1976)

# చైతన్య త్రిశూలం

శూన్య గగనంలో
దైన్యంలా తిరిగిన పక్షులు
ఆశావృక్షాల ఒడిలో
గూళ్ళు కట్టుకుంటున్నవి
రాబోయే వసంతానికి కాబోయే వారసుల్లా
ఆనందోత్సవం చేసుకుంటున్నవి
నిశ్శబ్దంలో ఆరిపోయిన గొంతుకల్లో
ఆమని పాటలు నింపుకొంటున్నవి
నా చేత నవచేతనాగీతాలు
వ్రాయించు కుంటున్నవి-
మండుటెండల బాధ భరించలేక
మామిడికొమ్మల్లో దాగి
కుహూ కుహూ యని మూల్గిన
కోకిలలు
ఈ నవవాసంత సందీప్తిలో
నవజీవన సుమవీథుల్లో
విప్లవగీతాలు పాడుతున్నవి-

ఆకలి బాకులు పొడిచిన
అడవి కడుపులో నుంచి
చిమ్మిన రక్తపు బిందువులు
ఆ మోదుగుపూలు
శ్రమజీవుల శిథిల జీవితాకాశంలో
సౌభాగ్య మధూదయ రేఖలై
ఆవిర్భవిస్తున్నవి-
కొండల్లో శిలలు మేల్కొని
క్రొత్తయుగాన్ని పిలుస్తున్నవి

కోనకోనల్లో వెలుగు వరదల్లో
చీకట్లు కొట్టుక పోతున్నవి
రాచిలుకలవలె పలికిన
రాబందులు పారిపోతున్నవి-

ఇన్నాళ్లు గంగి రెద్దులవాళ్లు ఆడించిన
డూడూ బసవన్నలు
జూలు దులిపిన సింహాల్లా విజృంభిస్తున్నవి.
గుడిసెల మీద గుమ్మడిపూలు
గట్లమీది గడ్డిపూలు
అడవిలోని తుమ్మిపూలు
సత్యం, శివం, సుందరంలా
చైతన్య త్రిశూలంలా రూపిస్తున్నవి
సామాన్యుని సామ్యవాద
శక్తిని నిరూపిస్తున్నవి-
శూన్య సుషుప్తి సమాధులనుంచి
చుక్కలు మేల్కొంటున్నాయి
కుటిల కుతంత్రాల కుత్తుకల ప్రేలుస్తూ
శవాలు మేల్కొంటున్నాయి
జిజీవిషలై తాండవిస్తున్నాయి,
తమ జర్జరిత శల్య శలాకలనుండి
విజయ శంఖారావం వినిపిస్తున్నాయి.
సాలెగూడు సమాజ వ్యవస్థలో
చిక్కుకున్న అమాయకుల్ని రక్షిస్తూ
సాంఘిక విప్లవం వ్యాపిస్తున్నది
రయీకృత రాజ్యాంగ రథాంగియై
సమ్యక్, సమైక్య సామ్యభారతి
రమణీయ కాంతితీరాలు చేరుకుంటున్నది.

(1976)

# తూర్పు తుపాను

మత్తెక్కి మైమరచిన కడలి
కండలు పెంచిన కడలి-గుండెలు లేని కడలి
తూర్పు తీరంలో తుపాను రేపింది
తెలుగు కోస్తాలో తిమిరం రేపింది
ప్రళయ ప్రభంజన శర పరంపరలతో
బడబాగ్ని జ్వాలా దంష్ట్రికలతో
పల్లెలమీద విరుచుకు పడింది
పట్టణాలను ముట్టడించింది -

కృష్ణా గోదావరి జీవనాలను త్రాగినా
తృష్ణ తీరని త్రాగుబోతు కడలి
పేదవారి ప్రాణాలు త్రాగడానికి
పెను తుపానై వచ్చింది
నిమిషంలో నీటివలల్ని విసిరి
నిస్సహాయులైన ప్రజల్ని నిర్దాక్షిణ్యంగా చంపింది -
పంట పొలాలను ఊదేసి
పచ్చని చెట్లను పెరికేసి
నిత్య జీవితాన్ని నీటిపాలు చేసి
విలయ తాండవం చేసింది
వినాశకోగ్ర పిశాచం -
ఉదయ కిరణాలు ఎంత లేపినా
కదల లేని కళేబరాలు
విశ్వకర్మ ఎంత ఊదినా
వెలుగలేని వేలవేల నయనాలు;
దివి సిమలో నరకం డేరా వేసుకుంది
భారతీయుల ప్రాణాలతో
మృత్యువు జలసా చేసుకుంది-

ఏమిటీ చేయడం!
హైదరాబాదుకు ఆక్రోశించింది
ఢిల్లీ గుండె గుభిల్లుమంది
తల్లడిల్లే తెలుగు తల్లిని ఓదార్చలేక
భరతమాత గుండె బరువుతో ఏడ్చింది
సానుభూతిపరుడైన మనిషి
సహాయ హస్తం అందించాడు
ఖండ ఖండాలలో మానవత కంటతడి పెట్టింది
మనుషులంతా ఒక్కటే అని
మళ్లీ ఒకసారి నిరూపించింది-

చావకముందే-పేదవారు, భాగ్యవంతులు
శవాలకు పేదరికం లేదు
సమతా రూపాలవి
తల్లి లేదు పిల్లలేదు-భార్యలేదు భర్తలేదు
ఊళ్లకు ఊళ్లేజాడలేవు
రక్షణ ఇచ్చే ఇళ్లే సమాధులై పోయాయి
పేటలకు పేటలే పీనుగ పెంటలైనాయి-

దివిసీమలో నరకం తాండ్రించి
గుంటూరులో జలధి గాండ్రించింది
తీరందాటి బంగాళాఖాతం
దూరదూరాలను ఆక్రమించింది-
ప్రకృతి శక్తుల
ప్రళయ పిపాసకు బలియైన
ప్రజాజీవితాన్ని పరిరక్షిద్దాం
దానవ శక్తినిదయాభక్తితోఎదిరిద్దాం
లక్షలాది సోదరుల కన్నీళ్ళను
అక్షరాల తుడిచి వేద్దాం
మానవత బ్రతికి ఉంటే మనిషికి భయం లేదని
మనమంతా నిరూపిద్దాం.

(1977)

# మాయదారి మలేరియా

కడుపులో
చలిగుండాలు
గొంతులో
గ్రీష్మశిఖలు
కాళ్లల్లో
శిశిరపాతాలు
కళ్లల్లో
శరన్మేఘాలు
తలలో
పర్జన్య గర్జనలు
అంతరంగంలో మాత్రం
అకాలమధుర వసంతం
ఆరు ఋతువుల
హఠాత్
అధర్మ సమర క్రియ
మాయదారి మలేరియా -
ప్రయోగించిన మాత్ర గెలిస్తే
మనిషి ఇహలోక విజయానికి
మరో ఓటు
ఓడితే
పరలోకంలో మరో సీటు.

(1977)

# ఒకే ఓటరు - ఒకే అభ్యర్థి

అరవైకోట్ల ప్రజల
అభ్యర్థిని నేను
ఒకే ఒక్క ఓటు అడుగుతున్న
ఒకే ఒక అభ్యర్థిని నేను-
నా ఎన్నికల గుర్తు
నేనే
నా మ్యానిఫెస్టో నా భవిష్యత్తు
నేను సాధించిన విజయం నా గతం
నా శపథం నా సంక్షేమం
ఈ ఎన్నికలు నా కలలు
నా ఆశల, ఆశయాల కడలిలో
మేల్కొన్న కల్లోలాల అలలు
ఈ ఎన్నికల ఫలితం ఏదైనా నాదే-
ఉన్నది ఒకే ఒక ఓటరు
ఎవరు ?
రంగంలో ఉన్నది ఒకే ఒక అభ్యర్థి
ఇంకెవరు ?
నాలుగు ముఖాల ఆ ఓటరు నాకే ఓటు వేస్తాడు
నాలుగు రకాలుగా మాట్లాడి నానా రభస చేసినా
నన్నే గెలిపిస్తాడు.
ప్రజాస్వామ్యం నా ఓటరు-ప్రగతి నా ఓటరు
సామ్యవాదం నా ఓటరు-సర్వజనసౌభాగ్యం నాఓటరు
ఈ నలుగురూ ఒకే ఒక ఓటరు
చతుర్ముఖ ఓటరు
నే నెవరో వేరే చెప్పాలా !
అందరి జీవితాలలో ఆనందం పండించాలని
ఆరాట పడుతున్న అభ్యర్థిని
మీ బాధల శిశిరాలకు హేతిని
మీలోని విజయ వసంతాలకు స్వాగత గీతిని
నవజీవన యుగ సారథిని
భారతిని—

(1977)

# ప్రజాశక్తి ప్రహ్లాదుడు

ఈ నదులు మన ఎదలు
ఈ కొండలు మన కండలు
ఈ గనులు మన కనులు
ఈ పొలాలు మన బలాలు
ఇవి మన అందరి కోసం
ఇది మనభారతదేశం-
ఉత్తుంగ తరంగ తురంగాల
శతాంగాలలో
అప్రమత్తంగా వీరవిహారం చేసే
అపార పారవారాలు
మన పవిత్ర తీరాలను పరిరక్షిస్తున్నవి
మనజాతి జీవనామృతభాండంలో
తస్కర ముష్కర పన్నగాలు
అవినీతి విషబిందువుల్ని రాల్చలేవు
మన కమ్మని కలల ఖాండవ వనాన్ని
విద్వేష హుతాశన కీలలు కాల్చలేవు

అదుగో !
పచ్చినెత్తురు త్రాగమరిగిన
విచ్చు కత్తుల కుత్తుకలుతెగిపోతున్నాయి
నీతికీ, నిజాయితీకి
గోతులు త్రవ్విన గుంటనక్కలు
ఆ గోతుల్లోనే పాతుకు పోతున్నాయి-
చెట్ల చెవుల్లో పక్షులు చెప్పేస్తున్నాయి
చీకట్ల రహస్యాలు
అన్ని గుట్టూ గ్రహించినట్లు
ఆ చెట్లు తల లూపుతున్నాయి

అణువణువున దేశభక్తి
ఆవిష్కృత మౌతున్నది
అడుగడుగున ప్రజాశక్తి
ఆశువుగా అవతరిస్తున్నది-

పల్లెటూళ్ల పండువెన్నెల్ని ఎత్తుకుపోయి
పంజరాలలో బంధించి
పట్టణ వీధుల్లో అమ్మే
పాపిష్టి కరాలు
నిగళ పంజరబద్ధమైనవి-
నిత్యావసర వస్తువుల్ని నిలువచేసి
వాటి విలువల వలువల ఊడదీసి
చీకట్లో వేలం వేసి
శ్రీకుళుల కైవసం చేసి
అనాథులను అడవికి పంపిన
ఆధునిక శకునుల ఆటలు సాగవిక-

మట్టి మాట్లాడుతున్నది
హిమాలయ శృంగాలతో
హిందుమహార్ణవ భంగాలతో-
అద్దె ఎంతఇచ్చినా
అన్యాయాలను మోయలేనంటున్నవి
వాహనాలు- శకటాలు-

శరణం లేదు
అమాయకుల సహన స్తంభాన్ని
కాలదన్నే
దురాశా దురాచార హిరణ్యకశిపులకు
మరణం తప్ప శరణంలేదు
ప్రజాశక్తి ప్రహ్లాదునికి భయం లేదు

(1977)

# నా దేశం నవ్వుతూంది

నాదేశం నవ్వుతూంది
నందన వనంలా— నాదస్వరంలా
కన్నీళ్ళు పండిన కష్టజీవుల బ్రతుకుల్లో
కాంతిరేఖల్ని పండించి
అసమానతకు బలియైన అదృష్ట హీనులకు
అసమాన శక్తి నందించి
నా దేశం నవ్వుతూంది నందనవనంలా
చెమట బిందువుల్లో
నవజీవన సింధువుల్ని సృష్టించి
బంజరు భూముల్లో బ్రతుకు బాటలు వేయించి
కర్షకుణ్ణి, కార్మికుణ్ణి కష్టించే ప్రతిజీవిని
రక్షారథం ఎక్కించి
నా దేశం నవ్వుతోంది నాదస్వరంలా

పస్తులున్న ఫ్యాక్టరీల్లో
నిస్తుల ఉత్పత్తి జరుగుతుంటే
ఉదధీశులకు ఊడిగం చేసిన నదీనదాలు
పేదవాని ఆకొన్న పొలాలలో
పెన్నిధిలు వెలిగిస్తుంటే
అలసట లేని తారురోడ్లు అడవుల్ని శోధిస్తుంటే
నాదేశం నవ్వుతోంది నందనవనంలా—

నాగార్జున సాగరతరంగాలలో
ఆర్యభట్టు విజ్ఞానాంతరాళాలలో
భిలాయి ఉష్ణోగ్రత ఉక్కు తారల్లో
బాంబేహై విజయ తైలధారల్లో
అర్వాచీన భారతి
నవీచీన రూపం సాక్షాత్కరిస్తున్నది
నాదేశం నవ్వుతూంది నాదస్వరంలా

# తీరం లేని తెలుగు ప్రగతి

చరిత్రతో శకునులు ఆడిన
పాచిక పందాలలో
చెల్లా చెదరైన తెలుగులు
మళ్ళీ కలిసికొన్నారు భాగ్యనగరంలో
శతాబ్దాల వియోగాన్ని గమించి
ఒకరి యోగక్షేమాల నొకరు తెలిసికొన్నారు
సమగ్ర తెలుగు మాతృ
ఉదగ్ర పాదాల సాక్షిగా
సమైక్యతా ప్రమాణం తీసుకున్నారు-
అయితే
తెలుగు పౌరుషంగూర్చి మన కవులల్లిన
తీవ్ర కవితల ప్రభావం కాబోలు
తెలుగువాళ్ళంటే ఎవరో తెలియచేయడానికి
తెగపోట్లాడు కొన్నారు-
నీకు స్వార్థం జాస్తి అంటే
నీకు సంస్కారం నాస్తి అంటూ
సోడాబుడ్లు పగిలేటట్లు కొట్లాడు కున్నారు-
కారంపూడి కారాలు నూరితే
మిర్యాలగూడ మిర్యాలు నూరింది
గాలికొండ డొక్క చీలుస్తా నంటే
గోలకొండ డోలు కడతా నంది
గోదావరి వరదలెత్తితే
మంజీర మంటలెత్తింది
తీయని భాషా మతల్లిని
తీరు తీరు యాసలు వెక్కిరించాయి
ఆకలి, ఆవేశం
ఆలోచనను ధిక్కరించాయి.

"కలిసి బ్రతకడం తెలియనివాళ్ళు
కలహప్రియులు తెలుగువాళ్ళు" అని
గోరింతలు కొండంతలు చేసిన
గోల గొంతుకలను నొక్కేశారు
కపటం లేని కౌగిలింతలతో
కాంతిరథం ఎక్కేశారు-
కొట్లాడుకోవడం తెలిసినవాళ్ళూ తెలుగువాళ్ళే
మళ్ళీ మాట్లాడుకోవడం తెలిసినవాళ్ళూ తెలుగువాళ్ళే
అని, తెలిసినవాళ్ళు పంపిన అభినందనలను
అందుకొన్న భారతీయులు తెలుగువాళ్ళే-

తెలుగువాళ్ల సమైక్యత నేడు
తీరతీరాలను చుంబిస్తున్నది
తెలుగుదేశ చైతన్య దీప్తి నేడు
దూరదూరాలలో ప్రతిబింబిస్తున్నది
ప్రఫుల్ల తెలుగు భారతి ప్రజ్ఞావేదిక
ప్రపంచ మహాసభలు వెలిగించింది
ఎక్కడున్నా
తెలుగులంతా ఒక్కటే అనిపించింది-
అమధ్య మన సాహిత్య నిధుల్ని చూచి
మలేషియా పులకించింది
మన ప్రతినిధి మండలిని గుండెకు హత్తుకొని
మారిషస్ స్పందించింది
ఈ మధ్యే నన్ను చూచి
అమెరికా ఎంతో ఆనందించింది-
'ఎలా ఉన్నారు మనవాళ్లు?
అడిగాయి అమెరికా తెలుగు నోళ్లు-
మన నదీనదా లిప్పుడు
దిక్కులేని దీనురాళ్లై సముద్రంలో దూకి

ఆత్మహత్య చేసుకోవటం లేదు
కొండల్లో పురాలు కట్టుకొని
పేదల గుండెల్లో కాపురాలు చేస్తున్నాయి-
మన ఊళ్ళల్లో కలలు పండుతున్నాయి
మన బీళ్ళల్లో
బ్రతుకు బాటలు మొలుస్తున్నాయి
కత్తులతో పరీక్షలు వ్రాసిన విద్యార్థులు
ఇపుడు కలాలతో వ్రాస్తున్నారు ;
సమ్మెలను ఉత్పత్తి చేసిన ఫాక్టరీలు
ఇపుడు సరుకుల్ని సృష్టిస్తున్నాయి.
మన ఆస్పత్రుల్లో యమబాధ తగ్గుతోంది
బాధమీద బ్రతుకు నెగ్గుతోంది.
కొత్తగూడెంలో బొగ్గుముక్కలు
వెలుగురెక్కలు తొడుక్కుంటున్నాయి
శిలేరులో నీటి చుక్కలు
శ్రీరాగ రేఖల్ని ప్రసవిస్తున్నాయి
కొండల్లో శిలలు లేచి కోకిలలై పాడుతున్నాయి
దళిత వృక్ష పల్లవ గీతాలను-
తెలుగుతల్లి మెడలో మళ్ళీ
మల్లెపూచండ విరుస్తున్నది
తెలుగు జాతి చరిత్రలో తిరిగి
వెలుగువాన కురుస్తున్నది-

అలవోకగా నినదించిన నా హృదయాన్ని
అమెరికా తెలుగువాళ్ళ
ఆనందాశువులు విన్నాయి
సమ్యక్, సమగ్ర, సమైక్య తెలుగుదేశ
చైతన్య రూపాన్ని కన్నాయి
అవసరానికి వెళ్ళిపోయిన తెలుగువాళ్ళు
అమ్మను చూడ్డానికి
ఆమె ఉజ్జ్వల భవిష్యత్తు కోసం
అనుభవాలను మోసుకొస్తామన్నారు. (1977)

# అస్థి వేణువులు

క్రూర కుటిల కుతంత్ర హస్తం
చీల్చిన ఎదలో నుంచి
వెలుగు పూల పొదలో నుంచి
ఎగసి పోయిన
పవిత్ర భారత సవిత్రి స్వప్నాలు
ప్రగతి దీపాలై నేడు ప్రజ్వలిస్తున్నవి
చేతనా కేతనాలై ప్రచలిస్తున్నవి-

మూగవోయిన
బోసినోటినుంచి
మోడు వారిన పాటల తోటనుంచి
చెదరిపోయిన
హరే రామ చిలుకలు
ప్రేమరాగ కోకిలలు
మళ్ళీ గూళ్ళు కట్టుకుంటున్నవి
మామూలు మనిషి గుండెల్లో ;
శైశిర భయం లేని సామ్యవాద వృక్షశాఖల్లో

సామ్రాజ్య వాదాన్ని సమరోన్మాదాన్ని
గజగజలాడించిన, ఓడించిన
ఊతకర్ర
తాత చేతినుంచి జారిపోయి
ఈ నాడు జాతికిజీవగర్ర అయింది-

ఈ మట్టిని ప్రేమిస్తే
మణులు దొరలి పడతాయి
ఈ రాళ్ళను సేవిస్తే
అమృతం ఒలికి పడుతుంది

అంటూ ఘోషిస్తున్నవి
మాట్లాడ నేర్చిన మట్టి రేణువులు
యమునా తీరంలో దాగిన
అస్థి వేణువులు-

అక్టోబరు రెండునాడు ఆవిర్భవించిన
ఆరిపోని వెలుగు వాకలు
జగన్మోహన భావరేఖలు
పల్లెసీమల్ని పల్లవి చేసి
ప్రగతిపాట పాడుతున్నవి
మానవతను పరిధి చేసి
జీవితవృత్తాలను అల్లుతున్నవి-
స్వచ్ఛంద అమరగానం వినండి
జాతి జ్యోతి అమృతరూపం కనండి
బాపూజీ భావ పుష్పాలతో
భారతావని పరిమళించనీయండి-

అదుగో!
ముప్పై ఏళ్ళ క్రితం
ముప్పయవ జనవరినాడు
రాగరాగోద్దీప్త
మహాత్మ చిందిన రక్తకణాలు
స్వేచ్ఛాలక్ష్మి ఇంటిలో క్రమ్మిన
చీకట్లను ఛేదిస్తున్నవి
నిర్బల, నిరీహ జీవితాలలో
నవచైతన్యం కలిగిస్తున్నవి-

సామాన్యునికి అర్థం కాని
సంకుచితత్వభాషలో
హిపోక్రసీ ఇచ్చే ఉపదేశాలకు
ఇక స్వస్తి చెప్పాలి

ప్రతిభను మింగివేసే సన్నాగాలను
అభివృద్ధిని కుంగదీసే అసమానతలను
త్యాగాన్ని కొరికివేసే స్వార్థాలను
నిలువునా నిర్మూలించాలి

వాదాలలో నలిపి
నినాదాలలో నిలిపి
సత్యాన్ని అసత్యం చేయకండి
అహింసను హింస చేయకండి
'అ' కారాన్ని
అటూఇటూమారుస్తూ
అశాంతిని సృష్టించకండి-
శ్రమజీవుల స్వేదబిందువుల్లో
స్వాతంత్ర్య విజయదుందుభులు మ్రోగాలి
పంటచేలలో- ఫ్యాక్టరీలలో
ఊరూరా, ఇంటింటా
క్రాంతి చక్రాల
శాంతి సంగీతం వినిపించాలి
ఇరువైయవ శతాబ్దాన్ని మేల్కొలిపిన
దేశభక్తి- త్యాగశక్తి
ఈ దేశాన్ని
ఇరువైయొకటికి నడిపించాలి.

(1978)

# ప్రగతిచేత పద్యాలు వ్రాయిస్తా

ఒకటవ నవంబరునాడు
ఓ పూట తీరిక చేసుకొని
రవీంద్ర భారతికి వస్తాను
రావాలి మీరు కూడా – అంది ప్రగతి
అతిశయోక్తులు లేకుండా
అయిదునిమిషాల్లో
తనమీద
ఆశువుగా కవితచెప్పమంది నన్ను
అనురాగవతి ప్రగతి–

ఎక్కడున్నావు ప్రగతీ !
ఓహో ! అక్కడెక్కడో ఉన్నావా
కాస్తముందుకురా !
వెనకాల నువ్వుంటే
ముందువాళ్ల కెలా కనిపిస్తావు
వాళ్ల వెన్ను తట్టి త్రోసుకుంటూ
ముందుకురా !
రా ! ఇంకా ముందుకురా
నా కళ్లలోనికిరా
నాలోనికి, లోలోనికి
నా గుండెలోనికిరా !
నిదానంగా చూడాలి నిన్ను ;
ప్రబంధకవిలాగ
నీ అంగాంగ వర్ణన చేయను
ఆత్మవర్ణన చేస్తాను–

ఇందరు కవులిక్కడున్నారనా
ఎందుకలా భయపడతావు ?

చల్లకొచ్చి ముంత దాచినట్లు
బహిరంగ దర్శనం ఇవ్వడానికి వచ్చి
ప్రచ్ఛన్నంగా ఉన్నావెందుకు
రా అమ్మా రా ?
రంగు రంగుల ఊహలు
రాస ప్రాస క్రీడలు అడే
రవీంద్రభారతిలో
ఈ కవీంద్రుల చెంతకురా :

ఇక్కడికి నీవు వస్తావని
వీళ్ళెవరికీ తెలియదు
అందుకే నిన్ను గురించి
ఉన్నదీ లేనిదీ ఊహించి
ఏదో ఏదో చెప్పేస్తున్నారు,
నిజమో కాదో తెలియని శ్రోతలు
నిట్టూర్పులు విడుస్తున్నారు
చప్పట్లు చరుస్తున్నారు-

నీగురించి నేను చెప్పడంకంటే
నీవు ప్రవచిస్తేనే బాగుంటుంది
నా భావ కవిత్వంకన్నా
నీ వాస్తవికత్వమే
ప్రజా హృదయాన్ని స్పందింప చేస్తుంది-

కొండరాతి గుండెలకు
తల బ్రద్దలుకొట్టుకొని
కానల్లోకోనల్లో ఏదోదారి పట్టుకుని
అడ్డమైన సముద్రాల్లో దూకి
ఆత్మ హత్య చేసుకొనే నదుల్ని
పల్లెసీమలకు, పంటచేలకు చేర్చి

నవజీవన సంగీతం నేర్పే ప్రగతీ!
నవ్వుల దివ్వెలు వెలిగించు
నీ చిరునవ్వే మా సిరినవ్వు-

రాలిపోయే నీటిచుక్కల్లోనుంచి
కాలిపోయే బొగ్గుముక్కల్లోనుంచి
కాంతి వీణాతంత్రుల్ని లాగి
క్రాంతి గానం వినిపించు.
సామర్థ్యం ఉన్న ప్రతివాడికీ
స్వయంఉపాధి కల్పిస్తున్నావని
భవిష్యత్తును వెలిగించే బాలబాలికలకు
అభ్యుదయవిద్య గరిపిస్తున్నావని
విశాఖలో ఉక్కుకవచం తొడుక్కుని
శ్రీశైలంలో విద్యుత్చక్రం పట్టుకొని
నీవు దారిద్ర్యంమీద దండెత్తావని
ఊరూరా చెప్పుకుంటున్నారు.
అందుకే!
సమైక్యరాష్ట్రంలో నీవు సాధించిన విజయాలను
చెక్కుచెదరని చెన్నుతరగని ఆశయాలను
ప్రజావిజయకావ్యంగా విరచించు
విశ్వసమ్మోహనంగా వినిపించు-

పల్లెసీమలు పల్లవిగా
పట్టణాలు అనుపల్లవిగా
ప్రాజెక్టులు, పరిశ్రమలు పాదాలుగా
సకలజన సంక్షేమం శైలిగా
విద్యావిజ్ఞానాలు యమకంగా
నీతి నిజాయితీలు గమకంగా
నీ సంసార రసకావ్యాలు రచించు
సాక్షాత్ సరస్వతీ! ప్రగతీ!
నీ సమ్యక్ స్వాతంత్ర్య సందీప్తాత్మను
నీవే ఆవిష్కరించు- (1978)

# మార్పే మధుమాసం

మందుడెండల్ని త్రాగేసి
కాలజీమూతాలను ఊదేసి
మధు గీతాలు పాడేసే
శివమెక్కిన కోకిలలు
శిథిలమైన కొమ్మల మీద చివుళ్ళు పండిస్తున్నవి
చీకట్లు కాటువేసిన చెట్లమీద
ఉదయకాంతులు ఆరబోస్తున్నవి
పొగచూరిన మోళ్ళమీద పగడాలు కురిపిస్తున్నవి
తీగెల వేడి నిట్టూర్పుల్లో రంగుల్ని రచిస్తున్నవి-
అవును
ఆ నవపల్లవ తాళవృంతాలు
ఆ లతాంత వేదాంతాలు
ప్రాణం పోస్తున్నవి నా ఊహాలకు
రూపం గీస్తున్నవి నాకలలకు-

కొరడాలు విసిరితే కోకిలలు కూయవు
కత్తులు ఝుళిపిస్తే కొమ్మలు విరబూయవు
క్రొత్తఆలోచనల కోకిల నాహృదయం;
క్రొత్త అనుభూతుల కొమ్మ నాఆత్మ !
ప్రగతి పల్లవాలు పల్లవిగా పాడుకోనీయండి దాన్ని
ఆనంద చేతనం కేతనంగా ఆడుకోనీయండి దాన్ని-

రాలిపోయే ఆకుల్ని చూచి జాలిపడకు తమ్ముడూ
పారిపోయే నీటిని చూచి పల్లటిల్లకు తమ్ముడూ
ఆకులు రాలితేనే చెట్టు ఎదుగుతుంది
నీరు పారితేనే ఏరు జీవిస్తుంది.
అందుకే
వ్యక్తులు త్యాగంచేసి సమాజాన్ని బ్రతికించాలి
క్షణాలను ధారపోసి యుగాలను నిర్మించాలి-

మధుమాసం మార్పుకు ప్రతినిధి
ఉగాది నవతకు పునాది-
స్వాతంత్ర్య ప్రియత్వానికీ
సమత్వ భావతత్వానికీ
చెట్టు చెట్టుపై గట్టు గట్టుపై
పుష్పాభిషేకం చేస్తున్నది
వాసంత విజయ ఇందిందిర
ఉగాది పర్వేందిర-

ప్రతి చెట్టుకూ పూచే హక్కున్నది
ప్రతి పక్షికీ పాడే హక్కున్నది
అని నిరూపిస్తున్నది ఆమని
జీవన రాగోద్దీపని-
గున్న మామిడి చెట్టులాగ నాగుండె గుబాళిస్తున్నది
ఉగాది పచ్చడిలాగ సమైక్యత రుచిస్తున్నది
మట్టిలో దాగిపోయిన పరిమళాలు
మళ్ళీ జీవన పుష్పాలైనవి
నవ చైత్రచైత్రుని అభయ హస్తంతో
చేదును జీర్ణించికున్న వేపపూలకు
ఒగరును దిగమ్రింగిన మామిడి పిందెలకు
విందు చేస్తున్నది ఈ ఉగాది- ఊరూరా మనసారా-

పొరుగు రాష్ట్రాలతో పోరుతీర్చుకున్న మన నదులు
అస్పృశ్యలై పడియున్న మరుభూముల్ని
ఆత్మాలింగనం చేసుకొంటున్నవి
అభినందిస్తున్నది ఈ ఉగాది-
పల్లె పల్లెలో పచ్చలతురాయి పెట్టుకొని
అభ్యుదయవృత్తి విద్యాయుధం పట్టుకొని
దరిద్రతలపై దండెత్తిన ప్రగతిలక్ష్మిని
దీవిస్తున్నది ఈ ఉగాది-
చిరకాల వాంఛలు తీర్చే సిద్ధార్థి ఈ ఉగాది (1979)

# చిరంజీవి స్వార్థం

సహస్ర ముఖాలతో
స్వార్థం విజృంభిస్తున్నది
కవితా వస్తువు కోసం వెదికే
నా కలానికి
అడుగడుగున ఎదురొస్తున్నది –
"సమాజాన్ని పీడించే
శక్తుల గురించి
సమాలోచిస్తున్న ఓ కవీ !
అన్ని శక్తులను నడిపించే
ఆది శక్తిని నేనేనయ్యా" అంటూ
అర్థాంతరన్యాసంతో
ఆత్మస్తుతి చేసికొంటున్నది

ఔను,
సర్వాంతర్యామి స్వార్థం
సర్వకళా కోవిద స్వార్థం
సర్వార్థ సముపార్జని స్వార్థం
కామ రూపిణి స్వార్థం
కళ్లున్నా లేకున్నా కనిపించే
యదార్థం స్వార్థం
నా కవితా వస్తువై కూర్చుంది–

వాణియైనా ఆకాశ వాణియైన
రేణువైనా కరేణువైనా
తప్పించుకోలేని
చిత్రాతిచిత్ర వ్యూహం
చిరంజీవి స్వార్థం –

మనిషిలోని దైవాంశాలను
మాలగా కూర్చుతుంటే
చిటుక్కున దారాన్ని కొరికేసే
చిట్టెలుక స్వార్థం
ఏ సూత్రాలకు కట్టుపడని
సూత్రధారి స్వార్థం

సమతాదీపాల పాలిటి
సుడిగాలి స్వార్థం
శాంతి గీతాల పాలిటి
అపశ్రుతి స్వార్థం
సామ్యవాద సాహిత్యాన్ని
సమయోచితంగా వ్యాఖ్యానించి
సకల జనాదరణ పొందే
సవ్యసాచి స్వార్థం -

ఏ పార్టీ ఏదైనా
మెజార్టీ తనదేనని
ఎన్నికలు ఎన్ని జరిగినా
ఎవరూ తననోడించలేరని
సవినయంగా చాటుకునే
"స్వార్థత్యాగి" స్వార్థం
దేవుణ్నీ దేశభక్తినీ
దివ్యంగా కొనేస్తున్న
ధీశాలి స్వార్థం
"నన్ను నీవు జయించలేవు" అంటే
సవ్వేస్తున్నది స్వార్థం -

(1980)

# సూర్యుణ్ణి మ్రింగిన చంద్రుడు

ఎవరినీ నమ్మడానికి లేదు
సూర్యుడైనా సరే
చంద్రుడైనా సరే !
తన కాంతిరక్తాన్ని ధారవోసి
ఘనత కెక్కించిన సూర్యుణ్ణి
గుట్టుగా పచ్చి పట్టపగలే
గుటుక్కున మ్రింగేశాడు చంద్రుడు
చిత్రం ఏమిటంటే
సిగ్గుతో బుగ్గియైన సూర్యుడు
తన స్థితిని చూడ వద్దన్నాడు
చూస్తే మీ కళ్లు పోతాయని
క్షుద్రశాపం పెట్టాడు-
గండంలో పడ్డవానికి
ధర్మా ధర్మ విచక్షణ లేదుకదా !
చంద్రునికైనా ఇంద్రునికైనా
చెడు బుద్ధులు తప్పవు కదా !
చుక్కలతో ఆడుకొనే శశి
సూర్యుణ్ని మ్రింగడం ఏమిటి !
సృష్టిని చూపించే సూర్యుణ్ని చూస్తే
దృష్టి కోల్పోవడం ఏమిటి ?
సూర్య చంద్రుల ధూర్త వర్తనం చూడలేక
మసక చీకటి ముసుగు వేసుకొని
మథన పడింది భూమాత
రవి గుండె మంటల్లో మాడిన చంద్రుడు
చేసిన తప్పు గ్రహించి శరణం గచ్ఛామి అన్నాడు
మన్నించాను పొమ్మనట్టు మందహాసం చిందిస్తూ
మార్తాండుడు
మట్టి చంద్రుడు పులిమినమైల కడుక్కోవడానికి
మహా సముద్రంలో మునిగాడు.
(16-2-1980 నాడు సంపూర్ణ సూర్యగ్రహణం కలిగించిన స్పందనం)

# ఆలోచన - ఆవేశం

ఏమి చేయాలో తెలియదు, కాని
ఏలా చేయాలో తెలిసిన
ఆలోచనా పరుడు ఒకడు
ఎలా చేయాలో తెలియదు, కాని
ఏమి చేయాలో తెలిసిన
ఆవేశపరుడు మరొకడు-

ఆవేశం లేని ఆలోచన
ఆలోచన లేని ఆవేశం
దేనికదే మూర్తీభవించిన
ముద్దుబిడ్డలను కన్నది తెలుగు గడ్డ-
ఆవేశమా ! కాస్త ఆలోచించు
ఆలోచనా ! కాస్త ఆవేశించు
అంటున్నది ఆంధ్రమాత
అభ్యుదయ భావ పునీత-

నాకు ఆలోచన లేదంటావా
నీ కడుపు మండ అంటూ
'ఆవేశం' మండిపడుతున్నది
నాకు ఆవేశం లేదంటావా
నీ నోరుమండ అంటూ
"ఆలోచన" త్రుళ్లిపడుతున్నది

ఆలోచన-ఆవేశం, అర్ధనారీశ్వరులై
అనంతానంద శిఖరాలపై
అభ్యుదయ నాట్యం చేసే
అమృత ఘడియల కోసం ఆక్రోశిస్తున్నది
కన్న బిడ్డల నెవరినీ కడుపు తీపితో
కాదనలేని తెలుగుతల్లి
ఆశానిరాశల మధ్య అల్లల్లాడే అనురాగవల్లి.

(1980)

# భిన్న చిత్రాలు

హిందూమహా సాగరం
హిమాలయ గళమెత్తి
భరతమాతృ హృదయ గంగా ఝురిలో
స్వేచ్ఛాగానం చేస్తున్నది
శూన్యగగనంలో మెరిసే
కోటి కోటి నక్షత్రాల్లా
దైన్యాకాశంలో మినుకు మినుకు మంటున్నాయి
ఆశానేత్రాలు-
భారతదేశంలో స్వాతంత్ర్యలక్ష్మి
ఏటేటా పండుగ చేసుకుంటున్నది
పేదవాళ్ళు మోసే పల్లకీలలో
స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ఉత్సవ విగ్రహాలు
ఊరూరా వూరేగుతున్నాయి-
స్వాతంత్ర్యం అనగానే
సగం కడుపు నిండిన సామాన్య జనం
మరోసగం నింపుకోవటానికి
మట్టితో పోరాడుతున్నారు.

ఉద్యోగాలు లేవు నిజమే ఎవరు సృష్టిస్తారు ?
ఇళ్ళు లేవు నిజమే ఎవరు కట్టిస్తారు?
రోడ్లు లేవు నిజమే ఎవరు వేయిస్తారు?
ఉత్పత్తి లేదు నిజమే ఎవరు చేయిస్తారు?
స్వాతంత్ర్యం తెచ్చిన సమస్య లివి
స్వాతంత్ర్యం లేనప్పుడు
దాన్ని సాధించటం ఒకటే సమస్య
తీరా అది వచ్చింతర్వాత అన్నీ సమస్యలే
సమస్యలు పరిష్కారం అవుతున్నా
పరిష్కారాలు సమస్యలౌతున్నాయి

అంగట్లో అన్నీ ఉన్నాయిగాని
అల్లునినోట్లో శని ఉందన్నట్లు-
ప్రణాళికలకు కొదవలేదు కాని
ప్రగతి రథం కదలడం లేదు

సాధించిన విజయాలకు కారణం తామే అనే వారే అందరూ
కలుగుతున్న అపజయాలకు
బాధ్యత ఎవరూ వహించటం లేదు-
ఆ దేశంలో అన్నీ ఉన్నాయి
ఈ దేశంలో ఏముందని వాపోయే వాజమ్మలు కొందరు-
ఇంతకూ, ఏమిటీ నీవు చెప్పేది
అంటున్నట్టు ముఖాలు పెట్టారు మీరు
ఔను, స్వాతంత్ర్యాన్ని స్వార్థం పట్టిపీడిస్తున్నది
అభివృద్ధిని అసమానత కొరికేస్తున్నది
చైతన్యాన్ని చేతగానితనం పెరికేస్తున్నది
ప్రతిభను పలుకుబడి క్రుంగేస్తున్నది
త్యాగాన్ని భోగం భోంచేస్తున్నది
కులనిర్మూలనాన్ని
కుల నిర్మాణం జయిస్తున్నది
డెమొక్రసీని
హిపొక్రసీ నడిపిస్తున్నది
పేదరికం ఓరువడలేక
పెద్దపెద్ద వాళ్లందరూ
మేడల మీద మేడలపై కూర్చుని
ప్రజా ప్రగతి గీతాలు పాడుతున్నారు
వెలుగు పావురాలవెంట వింత డేగలు పడుతున్నాయి
క్రాంతి మల్లెపొదల్లో కాలనాగులు పొంచిఉన్నాయి
ఇంతకన్నా విస్తరించి చెప్పను
ఈ స్వాతంత్ర్య దినోత్సవ శుభావసరాన
నా విప్లవ భావాల ముడివిప్పను
ఈ ప్రశాంత పర్వదినాన. (1981)

# ప్రగతి దీపాలు

పల్లెసీమ పల్లవిగా పాటలు వ్రాసి
పట్టణాలకు వినిపిస్తున్నాను
అభ్యుదయ నగర శ్రోతల హర్ష ధ్వానాలను
పల్లె కోకిలల కంఠాలకు
పల్లవాలుగా అందిస్తున్నాను
పల్లె సాహిత్యానికి
పట్టణ సంగీతం కూర్చి
ప్రగతి రసం పంచిస్తున్నాను-
ఔను,
మోడుబారిన పల్లెటూళ్లు
నా పాటకు పల్లవిగా పల్లవిస్తున్నాయి
మట్టిలో దాగిన మధురిమలు
నా కృతులకు శ్రుతులు పెడుతున్నాయి
అవును, ఆశల తుమ్మెదకు
ఆనందం చేకూర్చే చైత్రమంజీర రాగిణి
నా జైత్ర గీతానికి తాళం వేస్తున్నది-
కాకతీయుల కోటలోనికి కదలి వచ్చిన
ఏటికాలువ పాటలో
పరవశించే బీటు భూములు
నా పాటకు ప్రాణం పోస్తున్నవి-
అదుగో !
పేదల సేదబిందువులోనుంచి
ప్రగతివేదం ప్రభవిస్తున్నది
కాలం కాటువేసిన చీకటి బ్రతుకుల్లోనుంచి
నా నవ్యోజ్జ్వలదేశం ఉదయిస్తున్నది
అందుకే, కదలలేని
నా కలల గీతికల చరణాలు కదలుతున్నాయి

ఈ రవీంద్రభారతి వేదికపై
పలుకలేని
నా మాతృభాషా పదాలు పలుకుతున్నాయి
సమగ్ర సమైక్య భారతి
సరస హృదయ స్పందనంలో-
అదుగో!
విశాఖ సాగరతీరం
నా విశాల భావ వీచికలతో ఆడుకొంటున్నది
నాగార్జునసాగరం
నిజాం సాగరం
ఆ సాగర సంగీతంలో
నవజీవన సాగరాలై పాడుకుంటున్నవి -
అదుగో! సింహాచల శిఖరాలలో
జర్జర జీవిత విప్లవ గర్జనతో
స్తంభించిన నిరాశా స్తంభంనుంచి
నవశక్తి నరసింహం ఉద్భవించింది.
శ్రీశైలంలో విద్యుద్ధారగా విజృంభించి
పోచంపాడులో జలభేరిగా రణించి
తరతరాల
దుర్భిక్ష రాక్షసికుక్షిని చీల్చి విశ్లేషిస్తున్నది-
మిత సంతానవతియై
అమితానంద రుతియై
పచ్చని కేదారాలలో
వెచ్చని కర్మాగారాలలో
తరుణ భారతి చిందే
వరాల చిరునవ్వులు
నా పాటకు స్వరాలు కూరుస్తున్నవి
నా పాటలో
గిరులు, ఝరులు, వనులు, గనులు

పొలాలు, ఫ్యాక్టరీలు
ప్రణయ ప్రణవ ప్రగతినాదాలుగా రూపిస్తున్నవి
సమతా సౌభాగ్యవేదాలుగా దీపిస్తున్నవి -
నాతల తిరుమలయై
ప్రజా విజయ వేంకటేశ్వర నిలయమై
అభ్యుదయానంద సుప్రభాతం ఆలపిస్తున్నది
ఆబాల గోపాల హృదయ స్పందంగా
గోవిందంగా -
తూర్పు పడమరలు తలుపులు తెరచి
స్వాగతం పలుకుతున్నవి
నా సమైక్య సంపత్ వీణా పాణికి
తెలుగు వాణికి
మలేషియాలో
మల్లెపూదండ వేసుకొని
అమెరికాలో ఆనందోత్సవం చేసుకొని
తెలుగుతల్లి పాడుకుంటున్నది
నా వెలుగు పాటయై-చెలిమి తోటయై.

(1982)

# విప్లవ పంచాంగం

అంతరిక్షపు

అతిథియై

ఆనంద పారావారంలో తేలి

నవ జీవన

నక్షత్రంగా వెలుగుతూ

భావ భౌతికసత్య యోగంలో

కులమత వర్గీకరణమును

కూలద్రోస్తూ

పరిణామ ప్రపంచాంగంగా

ప్రణుతికెక్కుతున్న

భారతదేశానికి జయోస్తు-

సమతాభావ ప్రాభవాల

సారథియైన భారతీయుడు

ప్రారంభించిన

ఈ వీర విజ్ఞాన విప్లవ పర్వంలో

ఒళ్ళు విరిచి గర్జించే

ప్రజాశక్తి గర్వానికి విజయోస్తు.

(1982)

# కాలచిత్రం

తిరిగి తిరిగి అరిగిపోయిన
అరవై సంవత్సరాల పేర్లు
మార్చాలనుకుంటున్నాను
ఈ ఉగాది శుభముహూర్తాన-

పచ్చ పచ్చగా వచ్చిన వసంతంతో
వెచ్చ వెచ్చగా చర్చించి,
శుకాలతో, పికాలతో
సుందర ప్రసూనాలతో
సంప్రదించి,
క్రొత్తపేర్ల జాబితా
చిత్తశుద్ధిగా తయారుచేసి
ప్రజామోదం కోసం
పట్టుకొని వచ్చాను-

పేరు మారితే
తీరు మారుతుందా అని
పెదవి చప్పరించవద్దు
"పేరులో ఏమున్నది పెన్నిధి"
అని అన్నవాడి పేరేమిటో కాని
పేరుకోసమే కదా
మన పెనుగులాటలన్నీ !

కాలంకడుపులో పుట్టిన
లీలా రూపాలకు
పెట్టుకొనే ఆపేర్లేమిటో
ముద్దు ముచ్చటగా పెట్టుకోక
దుర్ముఖి, దుర్మతి అని

రాక్షస, రక్తాక్షి అని
విరోధి, వికృతి అని
ఖర, పరాభవ అని
క్రోధి, వికారి అని
కర్ణ కఠోర
అమంగళ, అపభ్రంశ నామాలుపెట్టి
అందాల కాలదేవతను
అవమానించడం
అపరాధం కాదా అంటున్నాను-

"గంగి గోవుపాలు
గంటెడైనను చాలు" అన్నట్లు
కంపుకొట్టే అరవై పేర్లకంటే
ఇంపుగా ఉండే ఇరవై చాలవా!
ప్రభవ, విభవ, యువ వంటి
పాపులర్ పేర్లుకొన్ని అలాగే ఉంచి
ప్రజోత్పత్తి, వంటి వాటిని
'ప్రజా నియంత్రణ'గా సవరించి
సాధారణ నామాలకు బదులు
అసాధారణాలు చేర్చి
శ్రవణపేయంగా
భువన మోహనంగా ఉండే
రసవద్వసంతాలతో
రచిస్తున్నాను
రాబోయే కాలచిత్రాన్ని
జన జీవన పత్రాన్ని
ఈ సంచలన చిత్రం
మానవ చరిత్రలో ఒకమలుపు
మనిషితో మైత్రికై దేవుని పిలుపు-

(1983)

# కులకర్త లెవరు?

కులాన్ని సృష్టించిన వారెవరు ?
ఎవరు ?
ఎవరూ మాట్లాడరేం !
వాల్మీకి !
నీవేమంటావు
లేదునాయనా నాకు తెలియదు
నన్నే బోయవాడన్నారు-
వ్యాస మహర్షీ !
మీ అభిప్రాయం ఏమిటి ?
నాకేం తెలుసు
నా మాట ఎవరు విన్నారు
నన్నే పట్టుకొని హరిజనుడన్నారు-
మనువుగారూ !
మీకేమైనా తెలుసా ?
నే నిప్పుడు ఏమీ చెప్పలేను
నా పేరు చెప్పి
స్వార్థం మోసం కలిసి
సృష్టించిన విషవలయం కులం
కురిపించిన హాలాహలం కులం -
కవీ ! సామాన్యుని జీవిత కంజాత రవీ
కానీ నీ తీర్పు!
ఎవరికీ పట్టని కులం-ఎవరికీ గిట్టని కులం
ఇన్నినాళ్ళు నెరపిన మాయాజాలం
మనిషి నేడు నిలదీసి అడుగుతున్న ప్రశ్నకు
మారుపలుకలేక మాయమై పోతూంది
నా వంటి వారిని చూచి భయపడి
నాస్తికమై పోతూంది

(1984)

# కడలి కెరటాలు

కడలి కెరటాలు నన్ను చూచి
కెవ్వున కేక లేశాయి
తమ స్వేచ్ఛాయాత్రకు అడ్డు తగిలి
తమను అశాంత పారవార కారాగారంలోనికి
నెట్టివేస్తున్న గట్టును నేనేనని భ్రమించాయో ఏమో !
నిజానికి నేను నీరధి నిశ్వాసతరంగాల నేస్తాన్ని-
ఊడిగపు ఉప్పునీటి సంకెళ్ల త్రెంచుకొని
ఉవ్వెత్తున విజృంభించిన
ఆ స్వచ్ఛంద చైతన్యోర్మికలను ఆహ్వానించడానికే
కటిక చీకటి అడవి దాటి కడలితీరం చేరాను -
పాప పంకిలమైన దేశాలను
అమాయకుల అభాగ్యుల
రక్త తర్పణం కోరుతున్న రాక్షస భూభాగాలను
హఠాత్తుగా ముంచి వేయుమని అభ్యర్థించడానికే
ఆ విక్రాంత వీచికల విప్లవ సన్నిధికి వెళ్లాను -

స్వార్థ పరత్వం సంకుచితత్వం కలిసి
అన్యాయాలనూ అక్రమాలనూ పండించే
దుర్మార్గ దుర్నీతి క్షేత్రాలను చేసి
కురుక్షేత్రాలు చేసి
సమతా సత్యధర్మానికి సౌభాగ్య పట్టం కట్టాలి :
ఇది నా తిరుగులేని లక్ష్యం
అవి ఈ అపోహాభీత వీచికలు
గుర్తించేదాక విశ్రమించను
కాలం కట్టిన అడ్డు కట్టల్ని దాటి
ఈ లీలా భీల తరంగాలు
కష్ట జీవుల బ్రతుకు బాధల్ని
కడిగివేసేదాక నిష్క్రమించను

(1983)

# జడ భరతుడు

కన్నీటితో వ్రాస్తున్నాను
పన్నీటి పాటను
ఆవేదనతో పాడుతున్నాను
ఆనంద గీతికను
సిగ్గుతో ఎగర వేస్తున్నాను
స్వేచ్ఛా స్వాతంత్ర్య పతాకాన్ని
విషాదాన్ని త్రాగుతున్నాను
విజయామృత చషకంలో -

దేశభక్తి, త్యాగశక్తి
క్రాంతిశీల ప్రజాశక్తి
అరవై ఏళ్లు పోరాడి
ఆర్జించిన స్వాతంత్ర్యాన్ని
వేలవేల వసంతాలు వెలిగించిన సంస్కృతిని
స్వార్థోన్మత్త కులతత్వం
సహనహీన మత మౌఢ్యం
కబళించాలని కుట్రలు పన్నుతుంటే
గ్రహించలేని-ఆగ్రహించలేని
జడభరతుణ్ని నేను
భారతీయుణ్ని నేను -
ఔను,
మతం పేరుతో, కులంపేరుతో
భాష పేరుతో, ప్రాంతం పేరుతో
నా జాతి గుండెలో నేనే బాకులు నాటే
భావావేశం నాది -
విశ్వజనీన, విజ్ఞాన వేద సంస్కృతిని
వెర్రి తలలు వేయించే

వికృతాకృతిలో చిత్రించే
వెర్రి విప్లవావేశం నాది -

అహం బ్రహ్మాస్మి-తత్త్వమసి
ప్రతిమనిషీ దేవుడే అంటూ
సత్య తత్వం ప్రవచిస్తాను
కాని, మనుషులందరూ సమానులే అను
మామూలు మానవతావాదాన్ని
సామాజిక సమతా వేదాన్ని
ఆచరించడానికి, అనుసరించడానికి
ముందుకురాని మూర్ఖుణ్ని నేను
జడభరతుణ్ని, నేను భారతీయుణ్ని నేను -

నింగి ముంగిట్లో
నాదేశోన్నత రాకెట్లు
గంగిరెద్దై ఆడుతుంటే
సగటు మనిషి
సంబరాల సంక్రాంతి జరుపుకుంటుంటే
వాయవ్య సరిహద్దుల్లో అతణ్ని
విద్వేష విషవాయువులు పీల్చేస్తుంటే-
తరతరాల చరిత్ర కట్టుకున్న
పవిత్రాశయాల పసిడి గుడిలో
విద్రోహం, విధ్వంసం చొరబడి
విలయతాండవం చేస్తుంటే
ఆ వింత పరిస్థితిని
పురోగతి అనాలో
తిరోగతి అనాలో
స్ఫురించక చస్తున్న శాపగ్రస్తుణ్ని నేను
జడభరతుణ్ని నేను-భారతీయుణ్ని నేను -

ఆకటితో
చీకటిలో అలమటించే
హిందూమహాసాగర స్వామిని
అదృష్ట తైలధారల్లో
స్నాన మాడించి
అభ్యుదయ భావ భావిదీపాలు పెట్టి
ఉభయసంధ్యా రాగడోలల్లో
ఊగే నాదేశలక్ష్మిని
ఈశాన్య నైరాశ్యారణ్యంలో
అనుమానాల గెరిల్లాలు
హత్యచేయ ప్రయత్నిస్తున్న
అస్తవ్యస్త దృశ్యాన్ని అభివర్ణించలేని
అవమానితుణ్ని నేను
జడభరతుణ్ని నేను-భారతీయుణ్ని నేను
ప్రణయానంద పారవశ్యంలో
ప్రణవ ప్రకృతి ఆడుకునే
ప్రగతి బంతిలాంటి భూగోళాన్ని
అంతరిక్షగవాక్షంనుండి
అవలోకించి పరవశించిన
లోకాతీత మనస్వి, దేశసేవాతపస్వి
నా సోదరుడు రాకేశ్
నా దేశపు గుండెల్లో
దివ్య స్నేహ దీపాలు వెలిగిస్తుంటే
ఆత్మ గౌరవగీతాలను
అవని గొంతుకకు అందిస్తుంటే
పొంగిపోయే భరతమాతను
క్రుంగజేసే
ఈ పీడకల లేమిటి ? -
నిర్బంధ కులాంతర వివాహాల

నిస్తుల ప్రేమారామంలో
మతాతీత సభ్యతా సమాజ వల్లికపై
సమతా సౌభాగ్య
జీవితోపనిషత్
స్వప్నాలు పండిద్దాం రండి -

నియంత్రిత కుటుంబ శక్తితో
స్వతంత్రతా, సమైక్యతా, సమగ్రతా
శాంతి సోపానాలపై యుగయుగాలు
భరత జాతిని నడిపించే
ప్రణాళికా ప్రణవశంఖం
పూరిద్దాం లెండి -

త్రికరణశుద్ధి లేని తెలివితేటలు
విద్యలు నేర్చిన హిపొక్రసీ
పర పీడన క్రీడ లాడకుండా
జాతి జీవిత రథాన్ని
దుర్నీతి పథాలవైపు త్రిప్పకుండా
పాటు పడతామని
ప్రతిజ్ఞ తీసుకుందాం రండి -

కుచేలునితో
కుబేరుడు
"త్వమేవాహం సహోదరా" అని
తాదాత్మ్యం చెందినపుడే
అద్వైత వేదాంతానికి
అర్థం సంక్రమిస్తుంది
ప్రజాస్వామ్య వాదంలో
పరమార్థం పరిమళిస్తుంది

# సంగర శృంగారం

కీలకమైన గట్టుమీద
ఎక్కు పెట్టిన ఫిరంగి
అందాల బీరూట్
నగర గర్భంలోకి
పిచ్చి ఆవేశంతో
ప్రేలుతున్నది,
లెక్కలేని జీవులు
అక్కడికక్కడే కూలిపోతున్నారు-

ఆశ్చర్యం ఏమిటంటే
కాల్పులూ కూల్పులూ
ఉన్మాదం ఉద్రేకం
కాస్త చల్లారగానే
జీవాత్మ బ్రతికి బయటపడి
ఆ చీకటి శిథిలాలలోనుంచే
మళ్లీ విజృంభిస్తున్నది
వినాశన శక్తులను
వీరోచితంగా ఎదుర్కుంటున్నది
అచ్యుత ప్రకృతి ధర్మాన్ని
అనంతమైన భగవదనుగ్రహాన్ని
నిగూఢ జీవిత తత్వాన్ని
నిర్వచిస్తున్నది
నిరూపిస్తున్నది-

(1984)

# కొలువుదిగిన రుధిరోద్గారి

తిరిగి తిరిగి వస్తున్న
తెలుగు సంవత్సరాలు
కాలానికి పహరాకాస్తున్న
కాన్‌స్టేబుల్స్‌-
పంచాంగం యునీఫారం వేసుకొని
ప్రథమ చైత్రంనాడు
వసంతానికి ఒకరు
వస్తున్నారు డ్యూటీపైకి-
తిథి, వార, నక్షత్రాలు తింటూ
ఆరు ఋతువుల చక్రంతో ఆడుకొంటూ
ప్రభవ, విభవ, శుక్లాది
అరవైమంది సిపాయీలే
అక్షయపటాలాలుగా
అవతరిస్తూ పోతున్నారు-
ఒక ఏడు డ్యూటీ చేసినా
యాభైతొమ్మిది ఏళ్ళు
అర్నడ్‌లీవు తీసుకుంటారు
ఎంత అద్భుతమైన సర్వీసో
ఈ పరవాలేని పరువాల
అరవై వసంతాలది

ఐ.ఏ.యస్‌, ఐ.పి.యస్‌
ఏ సర్వీస్‌ అయితేనేమి
ఎందుకూ కొరగావు
ఈ టి.వై.యస్‌ (తెలుగు ఇయర్స్‌ సర్వీస్‌) ముందు
అసలైన ఆలిండియా సర్వీసు ఇది-
ఎవరు సృష్టించారోగాని

అనుపమాన సర్వీసు ఇది
ఒక్కసారి రిక్రూట్ మెంటు అయితే
యుగ యుగాల దాక
రిటైర్మెంటు లేని
ఇటర్నల్ సర్వీసు ఇది-

ఎన్ని ఊర్లు మారినా
ఎన్ని పేర్లు మారినా
ధరిత్రి మారినా
చరిత్ర మారినా
మారని మహారాజులు
మన టి.వై.యస్. అధికారులు-

కొలువు తిరిగి రుధిరోద్గారి
వెళ్ళిపోతున్నాడు
మర్యాదగా వీడ్కోలు చెప్పండి
మళ్ళీ వస్తాడనే మాట మరవకండి
రాజాధికార దండంతో విచ్చేసిన
రక్తాక్షికి
స్వాగతం చెప్పండి అందరూ
సంవత్సరాదినాడు
ఈ ఉగాదినాడు.

(1984)

# ప్రబుద్ధాంజలి

క్రూర మృగాలు
విషసర్పాలు
రాబందులూ రాక్షసులూ కూడా
సిగ్గుతో తలవంచే
చిత్రహింసకు పాల్పడ్డ
విశ్వాస ఘాతకుల్లారా !
విద్రోహ భల్లూకాల్లారా !
స్వేచ్ఛాగగన సంఫుల్ల శాంతికపోతాన్ని
చీల్చివేసిన కిరాతకులారా !
విశ్వంభర విలపిస్తూంది
మీ వికృత విధ్వంసకాండచూచి-

మానవత్వాన్ని మంటగలిపే మనిషీ !
సంకుచిత స్వార్థపరత్వంతో
సహన హీన మత మౌఢ్యంతో
మానవలోకాన్ని ఎందుకు
మారణహోమం చేస్తున్నావు?
ప్రజాస్వామ్య పరాశక్తిని
పాశవికత జయించలేదు
ప్రజాజీవన ప్రగతియాత్రను
కుటిలకుతంత్రాలు ఆపలేవు-

భారతరత్న గర్భంనుండి
చిందిన ప్రతి రక్తకణం
మానవాభ్యుదయాకాశంలో
భావి భానువులై ప్రజ్వలిస్తాయి
భరత జాతీందిరకన్న
భాగ్యోదయ స్వప్నాలు

జన జీవన కాసారాలలో
నిజరాజీవాలై వికసిస్తాయి-

లెండి!
సజలనేత్ర సోదరులారా!
క్షతగాత్ర ప్రజలారా!
చెదరిపోని చైతన్య శక్తికి
శ్రద్ధాంజలి ఘటించండి
క్రొత్త ఆశల ఆశయాల
అంతరిక్షానికి
ప్రబుద్ధాంజలి ఘటించండి
సమ్యక్, సమగ్ర, సమైక్య
స్వతంత్రభారత సౌధాన్ని
కలకాలం నిలబెట్టడానికి
దృఢదీక్షాంజలి ఘటించండి!

(31-10-1984)

# అరవైల ఆటలు

అరవై ముఖాల ఉగాది
కాలాన్ని పాలిస్తున్నది
అరవై అరవై చేతులు ఆడిస్తూ
దేశాన్ని లాలిస్తున్నది-
గడియారం గుడిలో
గంట గంటకు అరవై నిమిషాలు
నిమిష నిమిషపు ఎదతో
స్పందనలు అరవై సెకండ్లు
అవి
కాలాన్ని భజిస్తున్నవి
విభజిస్తున్నవి-
ఒకటి-రెండు-మూడు......
ప్రభవ-విభవ-శుక్ల .......
సంఖ్యా భేదం ఉన్నా
సమ ప్రమానం ఒకటే
నామభేదం ఉన్నా
కాలరూపమొకటే-

అనంతకాల గర్భంలో
అరవై అరవైల
అకాండ లీలా విలాస కేళిలో
ఆవిర్భవిస్తున్నవి
ఈ ఉగాదులు
ఈ యుగాదులు
ఈ వసంతాలు-వేదాంతాలు
ఈ లతాంతాలు-జీవితాలు

(1985)

# జాతిమాత పిలుస్తున్నది

కలలు కనే నా హృదయం
కన్నీరు కారుస్తున్నది
ఆనందం పండే నా బ్రతుకులో
ఆవేదన రగులుతున్నది
నా మౌన మనోవ్యథ
అభివ్యక్తం చేసే
మహాకవి ఎవరు ?
నా విశాల కుసుమవనంలో
నాగుపాముల్ని చొరనీకండి
ఈ నేల నాడుల్లో
ఈ గాలి గుండెల్లో
ప్రేమ పరాగాలు పలికించే
స్నేహ సౌరభాలు చిలకించేతోటమాలిని
అవి
కాటు వేయకుండా కాపాడండి-
ఆవేశాలు కావేషాలుమాని
అందరూ కలిసి ఆలోచించండి
ఈ భరతమాత రూపాన్ని
భావి భాగ్యోదయ దీపాన్ని
నిల బెట్టండి-

అటు
రాజసంగా అంబరాలు చుంబించే
శీతాద్రి శిఖరాలనూ
ఇటు,
ఆత్మీయంగా సాగరాలను కౌగిలించే
తీరాల దృఢదీర్ఘ హస్తాలను
ఒకటిగా దర్శించే అఖండదృక్కును

ముక్కలు ముక్కలు చేసుకోకండి-
ఈ దేశ ప్రగతినీ అభ్యున్నతినీ నడిపించే
పంచప్రాణైక సత్యాల-ఆశామయస్వప్నాల
రెక్కల్ని ముక్కలు చేసికొని
మీరెక్కడికి ఎగసిపోగలరు ?
ఆవేశాలు కావేషాలు మాని
అందరూ కలిసి ఆలోచించండి !

భాషలు
మాట్లాడుకోవడానికి కాని
కొట్లాడుకోవడానికికాదు
ఏ భాషలో మాట్లాడుతున్నారన్నది
ముఖ్యం కాదు
ఏమి మాట్లాడుతున్నది ముఖ్యం
దురాలోచనల భాషకాదు కావలసింది
దూరాలోచనల భాష
దేశాన్ని దేశవాసుల్ని
విడదీసే భాషకాదు నేర్చుకోవలసింది
ముడివేసే భాష-
అందుకే
భాషపేరుతో విద్వేషాన్ని బోధించకండి
ప్రాంతాల పేరుతో
వివాదాల ద్వీపాలు సృష్టించకండి
ప్రాంతం ఏదైనా
స్వాంతం నాదేశమేనని
ఈ నేల పులకించేటట్లు
ఈ గాలి పరిమళించేటట్లు ప్రకటించండి-
అన్యాయాలను ఎదిరిస్తూ
ఆస్నేహాన్ని పెంపొందించే

భాష ఏదైనా నాదేనని
బల్లగుద్ది చెప్పండి-

శాంతి గీతాలు ఆలపించవలసిన మతాలు
సమర ఘోష నేర్పించ వద్దు
ప్రేమామృతాలు పంచవలసిన
హేమాలయాలలో
విద్వేష విలయనాట్యాల
ఉద్వేగాలు పెంచవద్దు-

మనిషిలోని
మానవత్వాన్ని మంటగలిపేవి
మతాలుకావు- మారణ హోమాలు
మనుషుల్ని బ్రతికించేవి కులమతాలు కావు
శక్తిని పోషించేవి రక్తపాతాలు కావు
అందరం కలిసి ఉంటేనే
ఇది సుందరమైన దేశం
ప్రతి ఒక్కరూ
అందరికోసం పాటుపడ్డప్పుడే
ప్రగతి నిత్య వసంతమై పాడుకొంటుంది-

స్వార్థాలను సంకుచితత్వాలను పెంపుచేయటానికి
భరతజాతి వెచ్చిస్తున్న శక్తిని
సమైక్యతనూ సర్వతోముఖ సౌభాగ్యాన్ని
సాధించడానికి వినియోగిస్తే
నా కన్నీరు పన్నీరై ప్రవహించదా
సమ్యక్ సమగ్ర సమైక్యతా కేదారమై
నా దేశం ఫలించదా!

(1985)

# బసవన్న కాదు, భరతన్న

ఈ ఆట నేను ఆడలేను
ఈ నటన నా చేత కాదు
డొక్కచీల్చే డోలును నమ్మి
స్వార్థపు ముంగిట్లో
డూడూ బసవడై ఆడలేను
మోసపు ముద్దబంతులు
మెడనిండా వేసుకొని
నా రోషం చంపుకోలేను-

అచ్చంగా పరమశివుని వాహనానివి
అక్షరాలా నీవే ఓ దేవునివి అంటూ
ముచ్చటైన అబద్ధాలు చెపితే
మురిసిపోయే మూర్ఖుణ్ణి కాదు నే నిప్పుడు-
ప్రజాస్వామ్య పాఠశాలలో
ప్రగతి పాఠాలు నేర్చుకుంటున్నాను
ప్రాథమిక హక్కుల బుక్కులు
బాధ్యతగా చదువుకుంటున్నాను-
'ప్రకృతి' ఏదో 'వికృతి' ఏదో
స్పష్టంగా వివరించే
సంస్కరణ సూత్రాలు అధ్యయనం చేస్తున్నాను-
మారు వేషాల వెనుక దాగిన
దారుణ రూపాలను అట్టే కనిపెట్టేసే
'ఆహార్యం' రహస్యం
అవగాహన చేసుకుంటున్నాను
అందుకే- నేను
వెర్రి మొర్రి బసవన్నను కాదు
వీర విజయ భరతన్నను!

(1985)

# తెలుగువాడు

వెలుగులోనుంచి పుట్టినవాడు
తెలుగువాడు
వేలాది వసంతాల విజయ ఛత్రం క్రింద
విజ్ఞాన పీఠం వేసుకున్నాడు తెలుగువాడు
కాలజ్ఞానం తెలిసిన కలకంఠం తెలుగువాడు
ప్రభవ విభవాది అక్షయ కాలరూపాలు
కనగలిగిన కళామయుడు తెలుగువాడు
విశాల భారతదేశం
విరజిమ్మే విప్లవహాసం
తెలుగువాడు ఈనాడు-

హిందూమహాసాగర తీరంమీద
తనగుండె గోదావరిని పిండి
శక్తిని వెలిగించే
స్నేహధారలు చిమ్ముతున్నాడు
చీకట్లను చీల్చివేసే
శివతాండవంచేస్తున్నాడు
తెలుగువాడు-
కష్టజీవుల కడలికెరటాలు
ఎత్తిపట్టిన
పిలుపు పిడికిలి
సింహాచల శిఖరం క్రింద
విశాఖ వీరభూమిలో
ధారిద్ర్య పిశాచంమీద దండెత్తిన
ఉగ్రభారత లక్ష్మికి
ఉక్కుకవచం తెలుగువాడు-
శ్రీశైల శిఖరంమీద
కృష్ణమ్మకంఠసీమలో
విశాలభావ విద్యున్మాలలువేసి

ఆమెనయన తారాకాంతుల్లో
పచ్చల కలలు రాశులుపోసి
గంగమ్మలా గౌరవించే
త్యాగధనుడు తెలుగువాడు
రాగధునుడు తెలుగువాడు-
ఇటు మలేషియా నుండి
అటు అమెరికాదాక
అటు మారిషస్ నుండి
ఇటు మాస్కో దాక
తన ఆత్మనాదవేద సంస్కృతినీ
అనంత సత్యసాహిత్యాన్నీ వెదజల్లి
సోదర మానవకోటికి
ఆదరణీయుడైనవాడు తెలుగువాడు
సౌజన్య రాజన్య కేతనుడు
శ్రీకార శిఖర దర్శన చిదానంద చేతనుడు
తెలుగువాడు ఈనాడు-

త్రిలోకాలనూ త్రికాలాలనూ
తన ఆచంచల భక్తిశక్తితో జతకూర్చి
ఏడు కొండలుగా మార్చి, తీర్చి
అఖిల జనానంద గోవిందునికి
ఆలయం నిర్మించిన
అద్వితీయ ఆగమశిల్పి తెలుగువాడు-
మూగవోయిన
జనజీవన మంజీరగళంలో
నవచైతన్యేందిరచేత
క్రాంతి నాదాలు పలికించిన
కర్మ వీరుడు తెలుగువాడు
ఢీకొన్నవాని పనిపట్టే
ఆకొన్నవానికి అన్నంపెట్టే
దండనాథుడూ దయామయుడూ
తెలుగువాడు.

(1985)

# కవితా కెరటాలు

## ప్రాసాపహాసం

సామాజిక స్పృహలేని సాహిత్యం
సంతాన ప్రాప్తిలేని దాంపత్యం-
పదవిలేని ప్రజాసేవ-గమ్యంలేని నావ-
రాజకీయంలేని రచనం-రాక్షసులులేని రామాయణం-
లంచంలేని ఉద్యోగం-పింఛం లేని మయూరం-
మధ్యతరగతి జీవితం-గుణితంలేని గణితం-

## నాదేశం

సభల్లో సమావేశాల్లో
మాటలూ-మాటలూ-మాటలూ
సందుల్లో, గొందుల్లో-ఇంటా, బయటా
మనుషులూ, మనుషులూ, మనుషులూ
మాటలకూ మనుషులకూ మధ్య
మోసాలు-ద్వేషాలు-రోషాలు-ధ్వంసాలు
నాదేశం .... ....

## ఆస్తికులు

ఆస్తి పాస్తులు ఉన్నవారు ఆస్తికులు
అవేవీ లేనివాళ్లు నాస్తికులు-
'నా అన్నది లేనివాళ్లే నాస్తికులై పోతున్నారు'
అన్ననగ్న సత్యాన్నిగ్రహిస్తే
అందరూ ఆస్తికులయ్యే అభ్యుదయాన్ని తేవచ్చు-

## పుస్తకం-మస్తకం

పుస్తకాన్ని మోస్తున్నది మస్తకం
అయితే-పుస్తకంలో వ్రాసింది
అంగీకరించేముందు-అనుసరించేముందు
ఆలోచించు
తల ఊపేముందు తర్కించు
పఠించినదాన్ని ప్రశ్నించు !

(1985)

# కవితా శాసనాలు

నాదేశ సమస్యలు నాకుతెలుసు
నా జాతినాడి నాకుతెలుసు
అలంకారాలు చేర్చి
అంత్య ప్రాసలు పేర్చి
అందాల కవితలల్లే నా కలంతో
మొక్కవోని యదార్థాలు ప్రతిబింబించే
ముఖ్యమైన మూడు శాసనాలు వ్రాస్తున్నాను-
ఆవేశం కాస్త ఆపుకొని
చేదునిజాలు తలచుకొని
మన మార్పుల ప్రణాళికలో
కొన్ని మార్పులు చేస్తున్నాను-

మార్పు! మార్పు! మార్పు!
ప్రతివాడూ ప్రకటిస్తున్నాడు తీర్పు
మార్పురావాలి-మంచిదేకాని
ఏదిమార్పు-ఎందులోమార్పు
ఎవరికోసం మార్పు?
మార్పురాకుండా మార్పులుచేసే
మాయామయ సమాజం మనది
మసిబూసి మారేడుకాయచేసే
మనస్తత్వం మనది
అందుకే
మార్పులు ఎన్నివస్తున్నా
ఈ దేశంలో మనిషి మారటంలేదు
మనిషి మనస్సు మారటంలేదు
రూపాలుతప్ప గుణాలు మారటంలేదు
వివరణలే తప్ప విశ్వాసాలు మారటంలేదు

భాషలు తప్ప భావాలు మారటంలేదు
మూలస్థితిలో, కాలగతిలో మార్పులేదు
కాబట్టే వ్రాస్తున్నాను
కవితా శాసనాలు మూడు-

మొట్ట మొదట
కులనిర్మూలన చట్టం చేస్తున్నాను
మీ అందరి ఆమోదంతో
కులాన్ని నిషేధిస్తున్నాను
'కులం' అంటే మనకుమనం పులుముకున్న
మలినం అని నిర్వచిస్తున్నాను
'కులనిర్మూలనం' అంటే
మనిషిని మనిషిగా మార్చటం అని
ప్రవచిస్తున్నాను-
విధిగా మానవవిధిగా
స్త్రీ పురుషులు కులాంతర వివాహాలు చేసుకొని
సమతా ధర్మంతో స్వకులవృక్షాన్ని
సమూలంగా పీకివేయ మంటున్నాను
త్వమేవాహం-తత్వమసి
సోహం-అహం బ్రహ్మాస్మిఐంటి
సూక్తులు వల్లించేమనం
చట్టపరమైన కులనిర్మూలనం
సంపూర్ణంగా సమర్థించాలంటున్నాను-

నేను చేస్తున్న రెండవశాసనం
పరిమిత కుటుంబచట్టం
'కుటుంబనియంత్రణం' అంటే
కూడు గూడు లేని
కూలివాళ్లను ముష్టివాళ్లను గాక
సౌభాగ్యవంతులైన సంతానాన్నికనడం అని

శాస్త్రీయంగా నిర్వచిస్తున్నాను
పుట్టినవాళ్లకోసమే పుట్టాయిచట్టాలనీ
దిక్కులేని సంతానాన్ని కనే
హక్కు ఎవ్వరికీ లేదని ప్రకటిస్తున్నాను-

ఇక నా మూడవశాసనం
'ప్రతి ఒక్కరికీ జీవనభృతి చట్టం'
భారతదేశంలో పుట్టిన ప్రతిబిడ్డకూ
సుఖమయ జీవనాన్ని సమకూర్చే బాధ్యత
సమాజం తీసుకుంటుందని
చాటిచెపుతున్నాను
పరిమితకుటుంబ ప్రజాస్వామ్యవ్యవస్థే
వారికి ప్రగతి మార్గం చూపుతుందని
గుండెనిబ్బరంతో ఘోషిస్తున్నాను-

పుట్టినవాళ్ల పక్షాన
పుట్టబోయే వాళ్లపక్షాన
తల్లిభారతి సమక్షాన
శాపగ్రస్త సమాజ విముక్తికోసం
నేనుచేస్తున్న కవితాశాసనాలివి
అన్ని హక్కులకంటే మిన్న అయిన
మానవ హక్కులు కలిపించే
మహనీయ శాసనాలివి-
కులాతీత మతాతీత
పరిమితకుటుంబ సంజాత సంతానంతో
జాతిని నిర్మించండి
భావిభారత చైతన్యాన్ని
వెలిగించరండి-

(1986)

# మనచేతుల్లోనే ఉంది

మంచైనా చెడైనా
మనచేతుల్లోనే ఉంది
దైవమైనా దయ్యమైనా
మనిషి ప్రవర్తనలోనే ఉంది
సుఖాలు దుఃఖాలు
ఆనందాలు ఆవేదనలు
అన్నీ మనం సృష్టించుకుంటున్నవే
కలలకూ నిజాలకూ
కర్త, కర్మ, క్రియ మానవుడే
దేశకాలాల కరదీపం మానవుడే!

ఆదిశంకరుల
అద్వైతతత్వం-మాయావాదం
మార్క్స్ మహాశయుని
అభ్యుదయతత్వం-సమతావాదం
ఘోషించే సత్యం ఒకటే
"ఈ జీవితం ఒక తెల్ల కాగితం
నీ జాతకం నీవే వ్రాసుకో!
అదే!
మన జీవితగతిని సమాజ ప్రగతిని
నిర్దేశించే నడిపించే శక్తి
మన చేతుల్లోనే ఉంది!"-

అహంబ్రహ్మాస్మి, తత్వమసి
త్వమేవాహం అని ఒకరంటే
ఔను
మనిషీ దేవుడే కాదు,
బలహీనుడూ బలవంతుడూ

జె. బాపురెడ్డి

కుచేలుడూ కుబేరుడూ
త్వమే వాహంగా సమానంగా
జీవించాలని మరొకరన్నారు-

ఏ మతమైనా ఏ వాదమైనా
మనిషిలోని మహాశక్తిని మంత్రించేవే
మనిషిలోని మనిషి శత్రువును నియంత్రించేవే-

స్వర్గం వేరేలేదు
నీ సౌఖ్యంలోనే ఉంది
నీ సౌఖ్యం వేరేలేదు
అందరి సౌఖ్యంలోనే ఉంది
అందరి స్వర్గం అందరి సౌఖ్యం
ఈ లోకంలోనే ఉంది
ఈ లోకాన్ని మానవలోకాన్ని
మలచే, మార్చే ప్రణాళికాపథకం
పుణ్యం-నైపుణ్యం
మన చేతుల్లోనే ఉంది.

(1986)



ప్రతిభావంతుడైన సహజకవి డా॥ బాపురెడ్డి. ప్రతిపదంలో, ప్రతిపాదంలో, ప్రతిపాదనంలో, ప్రతిస్పందనంలో ఏదో క్రొత్తదనాన్ని అందించే తేజశ్శిఖరం బాపురెడ్డి గారి సృజనాత్మకత. ఆలోచనలకు అనుభవ స్ఫూర్తినేచ్చే రసశిల్పా న్నిరూపించుటం, చమత్కారాన్ని చెమర్చే సంస్కారాన్ని కవితకు సాత్వికాభినయంగా సమ కూర్చటం, భావుకతకు పదపదార్థాలనే పక్షాల నమర్చి తత్వాంబర వీధుల్లో విహరింపజేయటం, మట్టిని సైతం మాణిక్యంచేసే మాధురీ సౌందర్య దర్శనాన్ని వాస్తవ జీవితానికి దర్పణంగా అమర్చటం రెడ్డిగారి కవితలోని నవతకు నాణ్యమైన గుణాలు. అనురాగాన్ని గేయంగా ఆలపించిన, అభ్యుదయాన్ని ఆధునిక కవితా ప్రక్రియల్లో పలికించిన ప్రజ్ఞామూర్తి బాపురెడ్డి.

వీరి "శ్రీకార శిఖరం" ప్రణవాత్మకమైన అద్వైత భక్తి భావ బంధురమైన గీతికాసంపుటి. వీరి "ప్రేమారామం" మానవహృదయ వీణ పాడిన రాగమాలిక-అనుభూతిగా జాలువారిన అంతశ్చేతన. "నాదేశం నవ్వుతూంది" "మనచేతుల్లోనే ఉంది" రెడ్డిగారి అభ్యుదయ భావజ్వాల హేలలు- సమదర్శనం నినదించిన సాహిత్య సామ్యవేదాలు. బాపురెడ్డి పద్యకావ్యాలు, బాపురెడ్డి గేయనాటికలు, అనంతసత్యాలు ఆయన బహుముఖ ప్రతిభాశక్తికి అక్షరరూపాలు. భావభౌతికవాదానికి పట్టుకొమ్మ బాపురెడ్డిగారి ప్రయోగం. పరిమళిస్తున్న అభినవ సాహితీ ప్రస్థానం వారి భావుకత. సమకాలీనాంధ్ర కవితాజగత్తులో బాపురెడ్డిగారి కవిత వేణునాదంగా వినిపిస్తున్న వైతాళికప్రబోధ.

జననం 1936, కరీంనగర్ జిల్లా సిరికొండ గ్రామంలో. విద్య-ఉస్మానియా విశ్వవిద్యాలయం-ఎం.ఏ. ఇకానిమిక్స్. సేవాతత్పరుడైన ఐ.ఏ.ఎస్. ఆఫీసరు. వీరు ముప్పది దేశాలు పర్యటించి అనేక సత్కారాలు అందుకొన్నారు. తన పర్యటనానుభవా లను అపూర్వకవితా ఖండాలుగా మలిచే భావశిల్ప డాక్టర్ బాపురెడ్డి. 1971లో ఆధు నిక కవితకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఎవార్డు వీరికి లభించింది. 1984లో జరిగిన ప్రపంచకవుల మహాసభల్లో వీరికి ప్రపంచకళా సంస్కృతుల అకాడమి నుండి గౌరవ డాక్టరేట్ బిరుదు లభించింది.

—ప్రచురణ కర్తలు

**MANA CHETULLONAY UNDI**

By Dr. J. BAPU REDDY

Price : Rs. 25/-

Publishers—Jayam Publications - Hyderabad.